# సోవియట్ సమీక్ష

నెహ్రూ,
శాస్త్రీయ
సోషలిజం

అంతరిక్ష
పరిశోధనలో
సహకారం

పునరుత్థానంపై
మత గురువుకూ
నాస్తికునికీ మధ్య
చర్చ

7 జూలై 1989

# సంబరాలు

లగ్జెంబర్గ్ యువరాణి మేరీ-థెరిసె మాస్కో లోని అర్బాత్‌లో (ఎడమ నుండి రెండవ వ్యక్తి)

ప్రముఖ సోవియట్ జర్నలిస్ట్ యూరి ఛెర్నిచెంకోతో మాండ్ వార్తా పత్రిక ప్రధాన సంపాదకుని సంభాషణ

లెనిన్‌గ్రాడ్‌లో నాన్‌ఫీచర్‌ఫిలిమ్స్ ప్రథమ అంతర్జాతీయోత్సవం. భారతీయ చిత్రనిర్మాత ఆర్.బి. పెండార్కర్ (ఎడమ), యీ వుత్సవ జనరల్ డైరెక్టర్ మిహయిల్ లిత్‌వ్యాకోవ్ (మధ్య).

ఫ్రెంచి మహావిప్లవ 200 వ వార్షికోత్సవాన్ని ప్రపంచ మంతటా గల ప్రజలు జూలై 14 న జరుపు కుంటారు. విప్లవోద్యమంలో స్థిరమైన ప్రజాతంత్ర సాంప్రదాయాలను యీ విప్లవం పాదుకొల్పింది. యీ విప్లవ విజయాలు యెంతో ముఖ్యమైనవనీ, సంస్కృతి, నాగరికతలతో మొత్తం మానవాళిని సుసంపన్నం చేసిన 19 వ శతాబ్దంపై యివి గొప్ప ప్రభావాన్ని నెరపాయనీ సోవియట్ రాజ్యనిర్మాత వ్లాదిమిర్ ఐ.లెనిన్ పేర్కొన్నారు.


# సోవియట్ సమీక్ష

7

సంపుటి 23

జూలై

1989

నంపాదకుడు :
వి. ఎఫ్. మ్కల్యావిన్

నంయుక్త నంపాదకుడు :
జి. ఆళవందార్

నహాయ నంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి

ఆర్టిస్ట్
వి.ఒ. అదామొవిచ్

పుటల రూపరచన

వి. వన్నబోయ్

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

SOVIET 'SAMEEKSHA - (Telugu)



ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తి వార్తా సంస్థవి

Printed by S. G. Dychev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.

# ఈ సంచికలో







3

ప్రజాప్రతినిధుల మహాసభ — గత డెబ్బయి యేళ్లలో యిలాంటి మహాసభ జరగడం యిదే మొదటిసారి. దీనికిదేసాటి. గతంలో కూడా సోవియట్ల మహాసభలు జరిగిన మాట నిజమే. కాని అవి దీనికి భిన్నమైనవి. సోవియట్ యూనియన్ డెబ్బయియేళ్ల చరిత్రలో యిలాంటి మహాసభ జరగడం యిదే మొదటిసారి. "సర్వాధికారం సోవియట్లకే" అనే నినాదం యిప్పుడు దాని అసలైన, సిసలైన అర్థాన్ని తిరిగి సంతరించుకుంటోంది. పరిస్థితులు త్వరితంగా మారిపోతున్నాయి. వాటితోపాటు సోవియట్ ప్రజలు మారిపోతున్నారు. వాస్తవంలో, వారు ఐదు సంవత్సరాల క్రితం వున్నట్టులేరు. పెరిస్త్రోయికా నిజంగా ఒక విప్లవమని వారి జీవితంలోని ప్రతి ఒక్కరోజూ ధ్రువీకరిస్తూనే వుంది. అంతేకాదు, ప్రతీరోజూ వారు యెదుర్కొంటున్న యిబ్బందుల్నూ, కష్టాలు కూడా దీన్ని ధ్రువీకరిస్తున్నాయి. పరస్పర సంబంధంగల రెండు రకాల సంస్కరణలకు - రాజకీయ, ఆర్థిక సంస్కరణలకు మాత్రమే పెరిస్త్రోయికా పరిమితమై లేదని వారు గుర్తించారు. గ్లాస్నోస్త్‌పై, జీవితాన్ని ప్రగాఢంగా ప్రజాస్వామ్యీకరించడంపై ఆధారపడి పనిచేసే సరికొత్త నూతన సూత్రాలకు సోవియట్ సమాజాన్ని పరివర్తింపజేసేందుకూ; న్యాయశాస్త్ర నియమానికి, సోషలిస్టు ఆదర్శాలకు, విలువలకు నిబద్ధమైన రాజ్యాన్ని సృష్టించేందుకూ పెరిస్త్రోయికా పరివ్యాప్తమైందని దీనర్థం.

సోవియట్ యూనియన్ యీనాడు ఒక సంక్లిష్టమైన దశను గడుస్తోంది. పెరిస్త్రోయికా వల్ల ప్రజల్లో పెద్ద యెత్తున జనించిన ఆశలకూ, ప్రస్తుత క్రమాలు యెదుర్కొంటున్న యిబ్బందులకూ మధ్య వైరుధ్యం అందరికీ స్పష్టంగా అనుభూతమౌతోంది. యింతటి విశాలమైనదేశంలో, యెంతో విస్తృత పరిధిగల విప్లవ కార్యాచరణకు పూనుకున్న సందర్భంలో యిలాంటి యిబ్బందులు తప్పనిసరిగా యెదురౌతాయి. పెరిస్త్రోయికా అంటే కేవలం రాజకీయాలు, తత్వశాస్త్రం, పథకాలు, ఆశలు మాత్రమే కాదు. యిది మారిపోయిన నేటి సోవియట్ సమాజపు వాస్తవికత - ప్రజలు అదురు బెదురు లేకుండా కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడుతున్నారు. అత్యంత ముఖ్యమైన మరో విషయం, రాజకీయ రంగంలో కొత్తవారు ప్రవేశిస్తున్నారు. పునర్నవీకరణక్రమాన్ని విస్తృత పర్బడంలో తోడ్పడే ఒక ముఖ్యమైన ఘటన యీ మహాసభ అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఒకటి మాత్రం స్పష్టం. సమస్యలన్నిటినీ యీ మహాసభ ఒకేదెబ్బతో పరిష్కరించలేదు. కానీ యీ మహాసభతొలి నిర్ణయాలపై దేశభవిష్యత్తు, పెరిస్త్రోయికా భవిష్యత్తు చాలా వరకు ఆధారపడి వుంది. తక్షణమే పరిష్కరించాల్సిన సమస్యలు యెన్నో వున్నాయి. కానీ మనం వాస్తవిక దృష్టితో పరిశీలిద్దాం: యీ సమస్యలన్నిటికీ పరిష్కారాలను సూచించే స్థితిలో యీ మహాసభలేదు. అందువల్ల మనం భ్రమలను వదిలించుకుని, నిజమేమిటో చూద్దాం: సోవియట్ ప్రజలు సాధించదలచుకున్న ప్రజాస్వామ్యమే సమస్యలన్నిటినీ పరిష్కరించలేదు, పరిష్కరించజాలదు. వాటిని పరిష్కరించుకోడానికి అది పరిస్థితులను సృష్టిస్తుంది, అంతే. పైగా సమస్యల స్వభావాన్నే ప్రజాస్వామ్యం మార్చివేస్తోంది: అవి ఒక నూతన సమాజ విలక్షణాలను కనబరుస్తున్నాయి. యీ సమాజంలో సమస్యలను బహిరంగంగా, స్వేచ్ఛగా చర్చించడమనేది బాధ్యతాయుతమైన, వ్యవహార సరళితో కూడిన పని — అందువల్ల యీ మహాసభ ముఖ్యంగా సమస్యలన్నిటినీ పరిష్కరించడానికి తగిన పరిస్థితులను సృష్టిస్తుందని సోవియట్ ప్రజలు ఆశిస్తున్నారు. యీ మహాసభ ప్రజల ఆదేశం ప్రకారం రూపొందింది; యిది మొత్తం దేశ చరిత్రలోనే మునుపెన్నడూ లేనంత అత్యంత ప్రాతినిధ్య స్వభావం గల ప్రజాస్వామిక సంస్థ అయింది.

## జవహర్లాల్ నెహ్రూ శతజయంతి దిశగా

# నెహ్రూ, శాస్త్రీయ సోషలిజం

ప్రొఫెసర్ రోస్తిస్లావ్ ఉలియనోవ్‌స్కీ

ప్రఖ్యాతరాజకీయ వేత్త, జాతీయ విముక్తి ఉద్యమ ప్రముఖ నాయకులలో ఒకరు, శాంతి, ప్రజాస్వామ్యం, సామాజిక ప్రగతి కోసం పోరాడిన యోధుడు, సామాజిక దురన్యాయం, జాతీయ పీడనలకు బద్ధ వ్యతిరేకి, సోవియట్ యూనియన్‌కు నిజమైన మిత్రుడు — ఇవీ, జవహర్లాల్ నెహ్రూ గురించి ఆయన సమకాలీనుల్లో నిల్చిపోయిన స్మృతులు.

ఈ మహా వ్యక్తిపట్ల ఆసక్తి, కాలంగడుస్తున్న కొద్దీ తగ్గేదేమీ కాదు. ఆయనను కలుసుకునే అదృష్టం లభించినవారినే గాక, ఆయన అమూల్య రచనలద్వారా, ఆయన అనేక జ్ఞాపకాల ద్వారా, ఆయనను గురించి పండితులు రాసిన పుస్తకాల ద్వారా ఆయనను గురించి తెలుసుకున్న వారిని కూడా ముగ్ధులను చేసిన ఆయన వ్యక్తిత్వం ఈ ఆసక్తికి కొంతవరకూ దోహదం చేసింది. అయితే, ఆయనను గురించి పరిశోధిస్తున్న వారికీ, ఆయన రచనలను చదివేవారికీ గల తరగని ఆసక్తికి ప్రధాన కారణం యిది: చింతనాపరుడుగా ఆయన మానవాళికి ఈ నాటికీ ఆందోళన కలిగిస్తున్న

అనేక సమస్యలను ప్రస్తావించారు.

# నెహ్రూ, శాస్త్రీయ సోషలిజం

చరిత్రలోని కొన్ని మైలు రాళ్ళ వంటి ఘటనలకు ప్రతీకలుగా నిల్చిపోయిన కొందరి పేర్లతో ఆ ఘటనలు ముడిపడి ఉండటం యాధృచ్ఛికం కాదు. అనేక మంది సుప్రసిద్ధ, అజ్ఞాత వీరులనూ, గొప్ప రాజకీయ నాయకులనూ తీర్చి దిద్దిన భారత దేశసుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటం ముఖ్యంగా మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ పేరుతో ముడివడి ఉంది. కాగా స్వతంత్ర భారతదేశ పటిష్ఠీకరణ జవహర్లాల్ నెహ్రూతో ముడివడిఉంది.

అయితే, నెహ్రూ ఒక్క భారతదేశానికి మాత్రమే కాక మొత్తం మానవాళికి చెందిన వారు. ఆధునిక అంతర్జాతీయ సంబంధాల వ్యవస్థాపకుల్లో ఆయన ఒకరు. ఆయన అలీనోద్యమ, ఉద్రిక్తతో పశమన విధాన ఆద్యులలో ఒకరు. సామ్రాజ్య వాద పీడనకు వ్యతిరేకంగా పోరాడుతున్న దేశాల ప్రజల ఆశలను ఆయన వ్యక్తం చేశారు. అయితే వారిని యూరప్, అమెరికా దేశాల ప్రజలకు పోటీగా పెట్టిగానీ, వేర్పాటు వాదం, జాతుల మధ్య జగడపు విధానం, గత ఘటనలకు పగతీర్చుకునే వైఖరులకు పాల్పడి గానీ ఆయన ఎరగరు మానవాళి ఉమ్మడి గమ్యంలోను, ప్రాక్పశ్చిమ సయోధ్యలోనూ ఆయనకు నమ్మకం ఉంది.

నెహ్రూకు గల రాజకీయ అంతర్‌దృష్టి శాస్త్రీయ సోషలిజం పట్ల ఆయన వైఖరిని సూచిస్తోంది. 1933 లో చేసిన ఒక సుప్రసిద్ధ పత్రికా ప్రకటనలో ఆయన కమ్యూనిజపు మౌలిక భావజాలం, చరిత్రలను గురించిన దాని శాస్త్రీయ వ్యాఖ్యానం సరియైనవని అన్నారు.

కమ్యూనిస్టు భావజాలాన్ని గురించిన అంచనా ఆయన దూర దృష్టికీ, సాహసంతో కూడిన ఆయన నిశిత ఆలోచనా సరళికీ, సిద్ధాంతంపట్లా, ఆచరణ పట్లా ఆయన నూతన ప్రగతిశీల వైఖరులకు మరొక్క నిరూపణ. తన రాజకీయ జీవిత ఆరంభకాలం నాటినుంచీనే ఆయన అక్టోబర్ మహా విప్లవ భావాలతో ప్రాభావితులయ్యారు. వాటి నిష్పాక్షిక, సవిమర్శక అధ్యయనం భారతదేశ సమస్యల పరిష్కారానికి దోహదం చేస్తుందన్నారు. సోవియట్ ''కమ్యూనిస్టు ప్రయోగం'' పట్ల ఆయన ఆసక్తి ఆయన జీవితాంతం వరకూ తగ్గకుండా అలానే ఉండింది.

ఈ ఆసక్తి జవహర్లాల్ నెహ్రూను శాస్త్రీయ సోషలిజాన్నీ మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల రచనలనూ చదవడానికి ప్రేరేపించింది. వీటి అధ్యయనం ఆయన దృక్పథంపై గణనీయ ప్రభావం నెరపింది. శ్రామిక వర్గ భావజాల సూత్రాలతో పరిచయమే ఆయన కొన్ని విషయాలు అంగీకరించడానికి కారణం. ''ఆత్మకథ'', ''భారతదర్శనం'', ''ప్రపంచ చరిత్ర'' లాంటి తన రచనల్లో ఆయన ఇలా అంగికరించిన ఉదాహరణలు ప్రత్యేకించి యెక్కువగా కనిపిస్తాయి. అవి అందరికీ తెలిసినవే అయినా కొన్ని పేర్కొన దగ్గినవి. నెహ్రూ ఇలా రాశారు. ''మార్క్సిస్టు సిద్ధాంతమూ మార్క్సిస్టు తత్వశాస్త్రమూ నా మనసులోని అనేక చీకటి కోణాలపై వెలుగును ప్రసరించాయి. నాకు చరిత్ర కొత్త అర్థంతో గోచరించింది. మార్క్సిస్టు వ్యాఖ్యానం దానిపై బ్రహ్మాండమైన వెలుగును ప్రసరించింది. దానికి ఒక వరస క్రమమూ, ప్రయోజనమూ ఉన్నాయని తేట తెల్లమైంది. అందులో ఫిడివాదానికి తావు లేకుండా ఉండడం, దాని శాస్త్రీయదృక్పథం నన్ను ఆకట్టుకున్నాయి.'' మరొక రచనలో ఆయన యిలా పేరొన్నారు. ''మార్క్స్, లెనిన్‌ల రచనల అధ్యయనం నా మనసుపై శక్తివంతమైన ప్రభావంనెరపి, చరిత్రనూ, సమకాలీన వ్యవహారాలనూ కొత్త వెలుగులో చూడటానికి తోడ్పడింది. సుదీర్ఘ చరిత్రకూ సామాజికాభివృద్ధికీ ఒక అర్థమూ, ఒక వరస క్రమమూ ఉన్నట్టు కనిపించింది. భవిష్యత్తును కప్పిన చీకట్లు విచ్చాయి.'' ఆఖరు విషయం,

# నెహ్రూ శాస్త్రీయ సోషలిజం

ప్రపంచ చరిత్ర'' అనే ఆయన గ్రంథం రెండవ సంపుటిలో "మార్క్సిజం'' అనే శీర్షికతో ఒక అధ్యాయం ఉంది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతంపట్ల గ్రంథకర్తకు సానుభూతి ఉందనీ, ఆయన ఆలోచనా విధానంపై దాని ప్రభావం వుందనీ ఈ అధ్యాయాన్ని బట్టి చెప్పవచ్చు.

అయితే, ఈ ప్రభావం సర్వావృత మయినది కాకపోయినా, ఈ ప్రభావ ఫలితంగా ఆయనకు మరింత వాస్తవికమైన దృష్టి అలవడటమే గాక, సోషలిస్టు భావాల పట్ల ప్రగాఢ విశ్వాసం యేర్పడింది. వలసవాద బానిసత్వానికి కారణభూతమైన సామాజిక-ఆర్థిక ఊబి నుంచి భారతదేశాన్ని బయట పడవేయగలిగినది ఒక్క సోషలిజమే, అని నెహ్రూ దృఢంగా నమ్మడం కూడ ఈ ప్రభావం వల్లనే. 1936 లో లక్నోలో భారత జాతీయ కాంగ్రెసు మహాసభలో ఆయిన ధైర్యంగా దేశానికి యిచ్చిన సందేశం యిందుకు సాక్ష్యం. "....భారతదేశ ప్రజల దారిద్ర్యాన్ని అపారమైన నిరుద్యోగాన్ని పతనావస్థను, దాస్యాన్ని అంతం చేయడానికి సోషలిజం తప్ప మరో మార్గం నాకు కనిపించడం లేదు. అందుకు మన రాజకీయ-సామాజిక నిర్మాణంలో విస్తారమైన విప్లవకర మార్పులు రావలసి వుంది. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో స్వార్థపర వర్గాల ప్రయోజనాలను తుదముట్టించ వలసి వుంది. అంటే, కొన్ని మినహాయింపులతో ప్రైవేటు ఆస్తి వ్యవస్థను రద్దుచేసి, లాభార్జనపై ఆధారపడిన ప్రస్తుత వ్యవస్థ స్థానంలో సహకార సేవ అనే మరింత ఉన్నత ఆశయాన్ని స్థాపించ వలసి వుందన్న మాట... ఒక్క ముక్కలో చెప్పాలంటే ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థకు సమూలంగా భిన్నమైన ఒక కొత్త నాగరికతను స్థాపించాలన్న మాట.''

అయితే మార్క్సిజం-లెనినిజం ఆయనపై యెప్పుడూ కూడా పూర్తి ప్రభావాన్ని నెరపలేదు. అస్తిత్వం, చైతన్యం గురించిన తాత్విక విషయాల్లో, ప్రజ్ఞానం, వ్యక్తియొక్క ఆత్మిక, నైతిక వికాసం గురించిన ఆయన సిద్ధాంతంలో, హైందవమత నిర్దిష్ట నైతిక సంప్రదాయాలూ, యూరోపియన్ హేతువాద సంశయ శీలత ఈరెంటి సమ్మిశ్రణ ఆయనపై ప్రాబల్యం వహించింది. కాని, సామాజిక-రాజకీయ సమస్యలకు ఆయన వ్యాఖ్యలో శాస్త్రీయ సోషలిజం ప్రభావమే పైకొనింది. ఉత్పత్తి పద్ధతులకు, ప్రజల పాత్రకు ప్రత్యేక ప్రాముఖ్యమిస్తూ, చరిత్రను గురించి మార్క్సిజం చేసే వ్యాఖ్యానాన్ని నెహ్రూ చాలా వరకు అంగీకరించారు.

రాజకీయ పోరాటంలో, కొన్ని సందర్భాల్లో, నెహ్రూ వివిధ తాత్విక దృక్పథాల్లోని విడివిడి సూత్రాలను ఉపయోగించారు. "భేదాలను, వైరుధ్యాలను కలిపి కట్టే మానసిక, లేదా ఆత్మిక వైఖరిని, వేరు వేరు మతాలను, భావజాలాలను, రాజకీయ, సామాజిక, ఆర్థిక వ్యవస్థలను అవగాహన చేసుకొని సర్దుబాటు చేసే వైఖరిని'' ఆయన అభిమానించారు.

కాని, "వివిధ భావజాలాల సంయోగం'' అసాధ్యం. ఇది నెహ్రూకు తెలుసు. ఆత్మ విమర్శ చేసుకొంటూ ఆయన తరచు, తన మునుపటి అభిప్రాయాలను మార్చుకొనేవారు. రాజకీయ, సామాజిక సమస్యల విషయంలో నెహ్రూ జిజ్ఞాస తీరు తెన్నులు నేటి పరిస్థితుల్లో ప్రాముఖ్యం సంతరించు కొంటున్నాయి.

ఆయన యూరోపియన్ బూర్జువా ఉదారవాదం నుంచి, ఫేబియన్ రూపంలోని సోషలిస్టు భావాలకు మళ్ళి, తరువాత వాటి నుంచీ శాస్త్రీయ సోషలిస్టు సూత్రాలను స్థూలంగా అంగీకరించే దశకు క్రమక్రమంగా చేరుకున్నారు. మార్క్సిజం-లెనినిజం ప్రాముఖ్యాన్ని గురించి మాట్లాడటానికి భయపడని మొట్టమొదటి జాతీయ విముక్తి ఉద్యమ నాయకుల్లో నెహ్రూ ఒకరు.

("నాయకత్రయం'' అన్న పుస్తకం నుంచి)

### ఆధునిక కాలంలో నూతన ఆలోచనా ధోరణి

# సమాజమూ, రాజ్యమూ

వ్యక్తి సమాజమూ, రాజ్యమూ ఒక్కటే, అవి అవిభాజ్యమైనవి. అంతే కాదు. రాజ్యం విడివిడి పౌరుల హక్కులనూ, మొత్తంగా సమాజ హక్కులనూ పూర్తిగా, ఫలప్రదంగా వ్యక్తం చేస్తోందన్న అభిప్రాయం సామాజిక శాస్త్రాల్లోనూ, పౌరుల చైతన్యంలోనూ దశాబ్దాలుగా ఉంటూ వచ్చింది. కానీ రాజకీయ సిద్ధాంతమూ, సామాజిక ఆచరణలో పండితులుకాని వారికి కూడా వారి దైనందిక అనుభవంలో సర్వశక్తివంతమైన రాజ్యం ముందు వ్యక్తియొక్క, సమాజంయొక్క నిస్సహాయత ద్యోతకం కాజొచ్చింది.

సోవియట్ ప్రజలకు వారి జీవితంలో అడుగడుగునా రాజ్యంతో సంబంధాలుంటున్నాయి. రాజ్యం కొన్ని సమయాల్లో మాత్రమే అనుమతినిస్తూ, తరచు, నిషేధాలను విధిస్తోంది, కార్యకలాపాలను సదా నియంత్రిస్తోంది. రాజ్యం తమను శిక్షించేది లేక క్షమించేదిగా, బహూకరించేదిగా, తమను కాపాడేదిగా ప్రజలు సర్వత్రా చూస్తున్నారు. ప్రజల సమస్త సమస్యలనూ పరిష్కరించగల అతీతశక్తి అనీ, దానితో మమేకమైతే, ఏవ్యక్తి జీవితమైనా అర్థవంతం అవుతుందనీ అనుకునే విధంగా రాజ్యంమారిపోయింది. సోషలిస్టు రాజ్యం సదా సమాజాన్నీ వ్యక్తినీ తనలో విలీనం చేసుకొందా? తాము విప్లవం పరిపూర్తి చేసినప్పుడు ప్రజలు కోరిందదేనా? అవధులు

ఎ.మిగ్రన్యాన్,
క్యాండిడేట్ ఆఫ్
సైన్స్ (చరిత్ర)

లేని ప్రజాస్వామ్యం కోసం కృషినల్పి, తుదకు అవధులు లేని నియంతృత్వాన్ని కొనితెచ్చు కొన్నామని అనుకునే పరిస్థితిలో వారు పడి పోయారా? ఈ ప్రశ్నలకు ఈ వ్యాసంలో సమాధానమివ్వగలనని ఆశిస్తున్నాను.

పొరపాటు ఎక్కడుందో చూద్దాం. మార్క్స్, ఎంగెల్స్‌లు "నాగరిక సమాజం" అన్న పదాన్ని భిన్న అర్థాల్లో వాడారు. అయినప్పటికీ వారు మొత్తం పైన సదా నైతిక, కుటుంబ, జాతీయ, సామాజికాది సమస్తరాజకీయేతర సంబంధాలు, ముఖ్యంగా ఆర్థిక సంబంధాలు అన్న అర్థంలోనే వాడారు.

మార్క్సిస్టు రాజకీయ సిద్ధాంతం రాజ్యానికీ, సమాజానికీ మధ్య పరస్పర సహకారాన్ని గురించిన తన సొంత సిద్ధాంతాన్ని సూచించింది. యిది వ్యక్తికీ, సమాజ, రాజ్యాలకూ మధ్య పోటీ పెట్టే బూర్జువా రాజకీయ తత్వశాస్త్ర సాంప్రదాయంతో తెగతెంపులు చేసుకొంది. ఆవైరుధ్యాల విషయ వలయాన్ని దాటి ఎంతో ముందుకు పోయింది.

ఉదాహరణకు, పొలెయిస్ అనబడే ప్రాచీన నగర రాజ్యాల్లో ప్రజలు రాజ్యాన్ని సమాజానికి వరాయిదైన, సమాజాని కన్నా వ్యక్తి కన్నా ఉన్నత శక్తిగా పరిగణించలేదు. సమాజానికీ రాజ్యానికీ ఎదురొడ్డి నిల్చిన స్వయంప్రతిపత్తిగల వ్యక్తి గురించిన భావం వారికిలేదు. అరిస్టాటిల్, ప్లేటో, తదితర ప్రాచీన తత్వవేత్తలు మానవుని సహజ స్థితిని అతడున్న నగరరాజ్యంలో అవిభాజ్య భాగమై పోవడంగానూ, అతని జీవిత ప్రయోజనాన్ని సమాజం వ్యవహారాల్లో పాల్గొనడంగానూ చూచారు.

ఆధునిక కాలం ఆ ఏకతను ధ్వంసం చేసింది. సమాజాన్ని రాజ్యానికీ, వ్యక్తిని సమాజానికీ, రాజ్యానికీ వ్యతిరేకంగా నిలిపింది. ప్రాచీన పాశ్చాత్య ప్రజాస్వామిక ఉదారవాద తత్వ వేత్తలు వ్యక్తికీ, నాగరిక సమాజానికీ లోనైవుండే ప్రతి పత్తిని రాజ్యా నికిచ్చారు. ఫ్యూడలిజంలో వర్గ ప్రత్యేక హక్కులను రాజ్యం కాపాడు తుండటం వల్ల, రాజుచేతుల్లో అది నిరంకుశపాలనకు పనిముట్టుగా పని చేస్తూండటం వల్ల ప్రజలు రాజ్యాన్ని ద్వేషించారు. యిది బూర్జువా విప్ల వాల్లో రాజ్య ప్రతిష్ఠ మరింత దిగజారడానికి దోహదం చేసింది.

బూర్జువా విప్లవాలు ముగిసిన తర్వాత, రాజ్యానికి "కాపలాదారు" పాత్ర నిచ్చారు దాన్ని "అనివార్య చెడుగు" గా పరిగణించారు.

అప్పుడు నాగరిక సమాజం దేశాల భవిత వ్యాలకు యజమానీ, పాలకశక్తీ అయింది. నాగరిక సమాజంపై అధికారం ఒక చిన్న సంపన్నుల, విద్యావంతులబృందం చేతిలోకి పోయింది.

వారు యథా తథ పరిస్థితిని కాపాడటానికి శాయశక్తులా ప్రయత్నించారు. బ్రిటిష్ తత్వ వేత్తలైన ఆడం స్మిత్, జెరెమీ బెంతాం, జాన్ లాకె, జర్మన్ పండితుడైన విల్‌హెమ్ వాన్ హంబోల్డ్ట్, ఫ్రెంచితత్వవేత్తలైన బెంజమిన్ కాన్‌స్టాంట్స్, ఆలెక్సిస్‌డి తోక్వివిల్లెలు దీనికి సైద్ధాంతిక ఆధారాలు సమకూర్చారు; తుదకు సమాజ జీవితంలో రాజ్యం పాత్రను కుంచించ డాన్ని చట్టబద్ధం చేశారు. చట్టం ముందు లాంఛనప్రాయ సమానత, ప్రజలకు రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనే అవకాశం లేని ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం —యివి నాగరిక సమాజాన్ని పరిపాలిస్తున్నవారి ప్రయోజనాలకూ, లక్ష్యా లకూ బహుచక్కగా నప్పుతున్నాయి.

ప్రజలు తీవ్ర సమస్యలను ఎదుర్కొనసా గారు. అవి సమాజంలో, రాజకీయ జీవితంలో తమ స్థానంలో మార్పు కోసం వారు పాటు పడేలా చేశాయి. బూర్జువా ప్రజాస్వామ్యపు ప్రాతినిధ్య రూపాలు గల దేశాల్లో, సమస్త పౌరు లకూ రాజ్యకార్యకలాపాల్లో పాల్గొనే వీలు కల్పించ డానికి 19వ శతాబ్దమంతా తీవ్రకృషి జరిగింది. ప్రభుత్వ సంస్థల్లోని తామెన్నుకున్న ప్రతినిధుల ద్వారా నాగరికసమాజంపై ప్రభావం నెరపేందుకు చేసే కృషిలో క్రియాశీల మైన ఉన్నత వర్గాల బృందానికి రాజ్యాన్ని పోటీగా పెట్టడం ప్రజలకు తప్పనిసరి

## సమాజమూ, రాజ్యము

అయిందంటే అందులో వైపరీత్యమేమీ లేదు. సామాజికంగా బాధ్యతాయుతమైన రాజ్యం గురించిన భావన ప్రాచుర్యానికి, ప్రగతిశీల శాసన నిర్మాణ పరిధి వగైరాల విస్తరణకు ప్రయత్నాలు జరిగాయి.

పాశ్చాత్యదేశాలో ఈక్రమం యిప్పటికీ కొన సాగుతోంది. ప్రవర్థిత పెట్టుబడిదారీ దేశాల్లో సామాజిక ఉద్రిక్తతకు యిది నిరంతరం కారణం. వ్యక్తికీ, సమాజానికీ, రాజ్యానికీ మధ్యగల వైరుధ్యాన్ని అధిగమించడం సిద్ధాంతాల్లోగానీ, రాజకీయ ఆచరణలోగానీ, సాధ్యం కావడంలేదు. రాజ్యంపై నాగరికసమాజపు ఇతోధిక నియంత్రణ గల దేశాల్లో పెట్టుబడిదారీ విధానం అతిఫలప్రదంగా అభివృద్ధి చెందిందని 18వ, 19వ శతాబ్దాల అనుభవం నిరూపించింది.

వ్యక్తి జీవిత, ప్రజా జీవితరంగాలను, వివిధ స్థాయిల్లోని రాజ్య సంస్థలనియంత్రణనుంచీ ఎంత బాగా కాపాడితే సమాజం అంతయెక్కువ ఫలప్రదంగా అభివృద్ధి చెందుతుంది. దీన్ని బ్రిటన్ (బ్రిటన్‌లో నాగరిక సమాజం రాజుకు వ్యతిరేకంగా 12 వ శతాబ్దం నుంచీ పోరాడి చివరకు 17 వ శతాబ్దంలో విజయం సాధించింది) 200 సంవత్సరాల అమెరికా చరిత్రా నిరూపించాయి. సోషలిజానికి చట్టబద్ధ, శాంతియుత పరివర్తనకు అత్యంత సానుకూల పరిస్థితులు రూపుగొని ఉన్నది బ్రిటన్, అమెరికాల్లోనే అని మార్క్స్, ఎంగెల్సులు పేర్కొన్నారు.

రాజు అధికారం అది ఏరూపంలో సమాజ స్వాతంత్ర్యాన్నిహరించ జూచినాసరే, దానినుండీ తనను తాను బ్రిటీష్ సమాజం యెంత శక్తివంతంగా కాపాడుకుందో తెలిపే ఉదాహరణను ప్రముఖ ఫ్రెంచి చరిత్రకారుడు హిప్పొలైట్ అడాల్ఫె తెయినే పేర్కొన్నారు. శాంతికిభంగం కలిగించినవారు, ఎలాంటి ముందు విచారణ లేకుండా బెయిల్, మొదలైనవేవీ యివ్వకుండా ఖైదుచేయబడతారన్న శాసనాన్ని 1 వ ఎడ్వర్డ్ రాజు (1239-1307) జారీ చేసినప్పుడు బ్రిటిష్ సమాజంలోని వారు ఈశాసనం ఎంతో అభ్యంతరకరమైనదనీ, దాన్ని రద్దు చేయాలనీ డిమాండ్ చేశారు. తమకు ప్రశాంత పరిస్థితి కొరవడినా సరే స్వాతంత్ర్యం వుండాలనీ వారికోరిక. బందిపోటుల బాధనైనా సహించవచ్చునుకాని, తమపై పెత్తనం చలాయించే అధికారుల దర్పాన్ని సహించ రాదని వారి అభిప్రాయం. బాగా అభివృద్ధి చెందిన నాగరిక సమాజం రాజ్య స్థిరత్వానికి పునాది. గొప్ప మార్క్సిస్టు సిద్ధాంతవేత్త, ఇటలీ కమ్యూనిస్టుపార్టీస్థాపకుడూ, నాయకుడూ అయిన అంటోనియోగ్రామ్‌స్కి (1891-1937) ఈ విషయమై ఇలా చెప్పారు: నాగరిక సమాజం ఇంకా రూపుగొంటున్న దశలో ఉండిన ప్రాచ్యప్రపంచంలో రాజ్యమే సర్వస్వమూ అయింది. పాశ్చాత్య ప్రపంచంలో రాజ్యానికీ, నాగరిక సమాజానికీ మధ్య నియమబద్ధ సంబంధాలుండేవి. రాజ్యస్థిరత్వానికి భంగం కలిగినప్పుడల్లా తక్షణమే నాగరికసమాజం తన దృఢమైన నిర్మాణ స్వరూపాన్ని ప్రదర్శించేది.

తన సంఘాలూ, సంస్థలద్వారా రాజ్యాన్ని నియంత్రించే నాగరికసమాజం స్వయం సమృద్ధీ, స్వయంసంపత్తీగల సర్వసత్తాక శక్తి. తన అంగాంగిక సమైక్యత భద్రంగా ఉన్నంత కాలమూ, రాజ్యం తన సంక్షోభ సమయాల్లో నాగరిక సమాజంపై ఆధారపడవచ్చు. అలాగే నాగరిక సమాజం తన సంక్షోభ సమయాల్లో రాజ్యంపై ఆధారపడవచ్చు. ఉదాహరణకు, రష్యా, జర్మనీల్లో మొదటి ప్రపంచ యుద్ధంలోని అపజయాలవల్ల రాజ్యంపడిపోవడానికి కారణం అక్కడ నాగరిక సమాజాలు తగినంత అభివృద్ధి చెందకపోవడమే. సుప్రసిద్ధ పాశ్చాత్య సామాజిక తత్వవేత్త ఆర్ డాహ్రేన్ డార్ఫ్‌కూడా ఇదేరకమైన నిర్ధారణ చేశారు.

కాబట్టి, ఏదేశంలోనైనాసరే పెట్టుబడిదారీ వ్యవస్థనుండీ, సోషలిజానికి పరివర్తనజరిగే

## సమాజమూ, రాజ్యము

టప్పుడు నాగరిక సమాజం యేమేరకు రాజ్యంనుండి వేరుపడిపోయిందన్న విషయా నికి ప్రత్యేక ప్రాధాన్యం ఉంది.

సామాజిక విప్లవం జరుగుతున్నప్పుడు నాగరిక సమాజంలో ప్రధానమైన మార్పులు వస్తాయనీ, ప్రైవేటు ఆస్తి, పాలకవర్గాలూ బలవంతంగా బయటకు నెట్టివేయబడతాయనీ మార్క్సిజం చెబుతోంది. నూతన రాజ్యాధికార వ్యవస్థ రూపుగొన్న తర్వాత, ఈ మార్పులు రాజకీయ రంగంలో చట్టబద్ధంచేయబడతాయి. ఈ విధంగా, నాగరిక సమాజం పూర్తిగా విముక్తం చేయబడుతుంది, శాస్త్రవేతర వర్గాలకు ఉత్పత్తి సాధనాల యాజమాన్యం లభిస్తుంది. తర్వాత, కొన్ని వర్గాలపై యితర వర్గాల పెత్తనాన్ని రక్షించే శక్తిగా రాజ్యం ఆవశ్యకత లేకుండా పోతుంది. వేరుమాటల్లో చెప్పాలంటే సోషలి జానికి పరివర్తన జరిగిన అనంతరం రాజ్యా నియంత్రక విధులకు సంబంధించిన రాజకీయ రంగ పరిధిని కుదించే క్రమాన్ని ప్రారంభించాలి. తుదకు రాజ్యం అంతరించి, కమ్యూనిస్టు స్వయంపాలనా వ్యవస్థదాని స్థానాన్ని ఆక్రమించేదాకా, నాగరిక సమాజ విస్తరణక్రమం కొనసాగాలి.

కాని, సోషలిజంలో రాజ్యమూ, రాజకీయ సంబంధాలూ ఉన్నంత వరకూ వివిధ స్వచ్ఛంద సంస్థలూ, సహకార సంఘాలూ, ట్రేడ్ యూనియన్లు మొదలయిన వాటిలో ఐక్యమై ఉన్న పౌరులకు, రాజకీయ నిర్ణయాల విషయంలో తమ అభిప్రాయాన్ని ప్రకటించే అధికారం ఉండాలి.

రాజకీయ నిర్ణయం తీసుకున్న తర్వాత, దాన్ని అమలుపరచే క్రమాన్ని ప్రజలు నిలకడగా నియంత్రిస్తారు. ఏ ఒక్క రాజకీయ నిర్ణయాన్ని తుది నిర్ణయంగా పరిగణించరాదు. ఎందు కంటే దాన్ని అంగీకరించని అల్ప సంఖ్యాకులూ ఉంటారు. ఈ అల్ప సంఖ్యాకులకు విమర్శించే హక్కూ, తమ విమర్శను ప్రజల దృష్టికి తీసుకువచ్చేహక్కు ఇవ్వాలి. ఇది సోషలిజం సాధారణ పరిస్థితుల్లో పనిచేయ డానికి అనివార్య ఆవశ్యకత.

ఏ ఒక్క నిర్ణయమూ సర్వకాల సర్వావస్థల్లోనూ పూర్తిగా సరియైనది కాజాలదు. ఎందుకంటే, నిర్ణయం చేసేటప్పుడు లభ్యమైన వాదనలనూ, వాస్తవాలనూ మాత్రమే పరిగణనకు తీసుకోవడం జరుగుతుంది. నూతన వాస్తవాలు, మరింత సమగ్రమైనవాదనలు మరోనిర్ణయానికి అను కూలంగా అధిక సంఖ్యాకుల తోడ్పాటును సంపాదించవచ్చు.

గతంలో ఆమోదించిన నిర్ణయం అనంతర కాలంలో అడ్డంకిగా తయారైనా, వ్యతిరేక పరిణామక్రమానికి కారణభూతమైనా ఆ నిర్ణయంపై గంభీరమైన బహిరంగ చర్చ జరుగుతుందని, అధిక సంఖ్యాకులకూ, అల్ప సంఖ్యాకులకూ మధ్యగల ఈ చట్టబద్ధ సంబంధం హామీ ఇవ్వాలి. అప్పుడు కొత్త మెజారిటీ అభిప్రాయానికి అనుగుణంగా ఒక కొత్త రాజకీయ నిర్ణయం తీసుకోవడం జరుగు తుంది. ఉత్తరాది నదుల ప్రవాహమార్గాన్ని వెనక్కు మళ్ళించాలని కొన్ని ప్రభుత్వ డిపార్ట్ మెంటులు చేసిన నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలు చేసిన ఆందోళనను గౌరవించి ఆ నిర్ణయాన్ని ఇటీవల రద్దు చేయడమే ఇందుకు ఉదాహరణ.

నూతన సోషలిస్టు వ్యవస్థలో రాజ్యానికీ, నాగరిక సమాజానికీ మధ్య సంబంధాలు, అంతకు మునుపటి చారిత్రక దశలో వాటి సంబంధాలపై ఆధారపడి ఉంటాయి. బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానం, బాగా అభివృద్ధి చెందిన నాగరిక సమాజంగల దేశం ఏమంత బాధాకరం కాని మార్గంలో సోషలిజానికి మారే అవకాశ ముంది. సోషలిజానికి మారిన తర్వాత అలాంటి దేశంలో సమాజానికీ, వ్యక్తికీ, రాజ్యా నికీ మధ్య సంబంధాలు మార్క్సిస్టు రాజకీయ సిద్ధాంతానికి మరింత అనుగుణంగా ఉంటాయి.

## సమాజమూ, రాజ్యము

రష్యాలో లాగా, పాత వ్యవస్థలోని అంతర్గత శక్తి పూర్తిగా వినియోగంలోకి రానిదేశంలో ఈ నూతన సామాజిక-ఆర్థిక నిర్మాణానికి మారేందుకు చరిత్ర అవకాశమిచ్చినప్పుడు పరిస్థితి ఇందుకు పూర్తిభిన్నంగా ఉంటుంది. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలు తగినంత అభివృద్ధిచెందకపోవడం వల్ల, నూతన వ్యవస్థకు పరివర్తన మొదట ఉపరి నిర్మాణంలో జరుగుతుంది. సమాజం యొక్క ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవితాన్ని సమూలంగా పునర్ వ్యవస్థీకరించే బాధ్యత నూతన సోషలిస్టు రాజ్యంపై పడుతుంది. ఆపనిచేయగలిగినది అదొక్కటే. తన కాళ్ళపై నిలబడగల పాత నాగరిక సమాజ అంకురాలు సైతం నూతన జీవిత నిర్మాణక్రమం నుంచీ పూర్తిగా వేరుపడిపోతాయి. ఎందువల్లనంటే, అవిపాత వ్యవస్థతో గాఢంగాపెన వేసుకొని ఉంటాయి. దీనంతటి ఫలితంగా పరిస్థితి మరింత క్లిష్టమవుతుంది.

అటువంటి పరిస్థితుల్లో పునర్నిర్మాణక్రమాన్ని త్వరితంచేయడానికి నూతన ప్రభుత్వం యెంతగట్టిగా ప్రయత్నించినా సరే, నాగరిక సమాజ సత్వరపురోగమనాన్ని రెండు ప్రధాన అంశాలు క్లిష్టం చేస్తాయి. మొదటిది. దేశ ఆర్థికాభివృద్ధికి సంబంధించిన కర్తవ్యాలు బ్రహ్మాండమైనవి కావడం; దేశాన్ని ఆంతరంగిక, బాహ్యశక్తులనుండీ కాపాడవలసిన ఆవశ్యకత వల్ల రాజ్యాధికారం మరింత బలంగా కేంద్రీ కృతం కావడం; రాజ్యం యొక్క హక్కులు, అధికారాలు, ప్రత్యేకించి దాని దండన సంస్థల అధికారాలు విస్తరించడం. రెండవది, జనాభాలోని అత్యధిక సంఖ్యాకులు సాంస్కృతికంగా, విద్యావరంగా వెనుకబడి వుండడం, రాజకీయ పరిణతి లేకపోవడం. ఇందువల్ల, రాజ్యం అప్పుడప్పుడే రూపు గొంటున్న సమాజంపై, దాని సంస్థలపై నిరంతరం అజమాయిషీ చేయవలసి వస్తుంది.

ఈ పరిస్థితులలో సామాజిక వ్యవస్థ నిర్వ హించవలసిన తక్షణ విధులను కూడా చేపట్ట లేకపోతుంది. కాబట్టి, రాజ్యం తన సొంత విధులనేగాక, నాగరిక సమాజ విధులను కూడా నిర్వహిస్తుంది.

దీని ఫలితం స్వయం విదితమే. రాజ్యం సమాజాన్నీ వ్యక్తినీ తనలో విలీనం చేసుకొని తన నిర్ణయాలను, బదులు చెప్పకుండా పాటించవలసిందిగా డిమాండ్ చేస్తుంది.

విప్లవానంతరరాజ్యం ఆర్థిక, సాంస్కృతిక విధులతోపాటు ఒక నూతన నాగరిక సమాజాన్ని సృష్టించేందుకు కృషిచేయాలి. ఆర్థిక, సామాజిక - సాంస్కృతిక వ్యవహారాల్లో రాజ్యం జోక్యం చేసుకోవడాన్ని క్రమక్రమంగా తగ్గించాలి. స్వచ్ఛంద సంస్థలను పెంచి, పోషించాలి. ప్రజల సృజనాత్మక శక్తి సామర్థ్యాలను వినియో గంలోకి తీసుకురాగల సంస్థలు ఏర్పడేలా చూడాలి. నాగరిక సమాజం బలంపుంజుకొనేకొద్దీ రాజ్యం నిర్వహించే అజమాయిషీ విధులు క్రమంగా కనీసస్థాయికి తగ్గించాలి. సిద్ధాంతం సూచిస్తున్నట్టు రాజ్యమే, సమాజనియంత్రణ కింద, సమాజం నిర్వహించే విధులలో ఒకటి కావాలి. రాజ్యంక్రమంగా ఢుల్లిపోయే అవకాశం ఇదొక్కటేనని మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలు చెబుతున్నాయి.

సోవియట్ చరిత్రలో, ఒక దశ, అంటే నూతన ఆర్థిక విధానదశ (నెప్), నాగరిక సమాజ పురోభివృద్ధికి తగిన పరిస్థితులను నెలకొల్పి వుండేది. సమాజ జీవితరంగాల న్నింటా సోషలిస్టు సంబంధాలను సుస్థాపితం చేస్తూనే, వ్యక్తులూ, అన్ని వృత్తులవారూ సృజనాత్మక చొరవచూపే అవకాశానికి హామీ కల్పించడం, ఆనాడు లెనిన్ విధానలక్ష్యం. కాని, స్టాలిన్ బృందం తన ఆమోదముద్ర లేనిదే వ్యక్తులకు, వివిధ బృందాలకు తమ అభిప్రాయాలను వెల్లడించేందుకు వీలులేని విధానాన్ని అనుసరించింది. "నిషిద్ధం కాని

# సమాజమూ, రాజ్యము

దేనికైనాసరే అనుమతి ఉంది" అనే ప్రజాస్వామిక అధికార వ్యవస్థ సూత్రానికి బదులు "అనుమతి లేనిదేదైనా సరే నిషిద్ధమే" అనే సూత్రాన్ని పాటిస్తూ ప్రజలు బతకవలసి వచ్చింది.

రాజ్యాధికారాన్ని గట్టి అదుపులో వుంచగల సువ్యవస్థిత సంస్థలు సమాజంలో లేనందువల్ల, 19 వ శతాబ్దంనాటి ఫ్రెంచి రాజకీయతత్వవేత్త టాక్వేవిల్లే భయకంపితుడైె పేర్కొన్న పరిస్థితిని స్టాలిన్ తెచ్చి పెట్టారు అదేమిటంటే సమాజంలో అందరూ సమానులయ్యారు; రాజ్యాధికారం ముందు వారు సమానంగా నిస్సహాయులయ్యారు కూడ.

ఇక్కడ ఒక ప్రశ్న ఉత్పన్నమవుతోంది. రాజ్యవ్యవహారాల నిర్వహణలో అందరూ పాలువంచుకుంటారనీ, రాజ్యం క్రమేణా ఉల్లి పోవడానికి అదిదారి తీస్తుందని మార్క్సిస్టు సిద్ధాంతం చెబుతూంది. అలాంటప్పుడు, సోవియట్ రాజకీయవ్యవస్థ పురోగమనం, రాజ్యాధికారం నుంచి ప్రజలు వేరువ డేందుకు దారితీయడం ఎలా జరిగింది?

రాజ్యవ్యవహారాల్లో యావన్మందీ పాల్గొనాలనే మార్క్సిస్టు భావాన్ని అమలువరచేందుకు, సమస్త ప్రజల సమష్టి, ఏకైక సంకల్పాన్ని వ్యక్తం చేస్తుందని చెప్పబడే ఒక యంత్రాంగాన్ని సోవియట్ యూనియన్ సృష్టించింది. జిల్లా మొదలుకొని పైవరకు ఓటర్లంతా తమ ప్రతినిధిని ఏకగ్రీవంగా ఎన్నుకొంటారు. ప్రతినిధులు, ఏదో నిర్ణయం విషయంలో ఓటర్లు తమకిచ్చిన ఆదేశం ప్రకారం, ఏకగ్రీవంగా దానికి ఓటు చేస్తారు. ప్రతి ఒక్క సోవియట్‌లోని ప్రతి ఒక్క ప్రజాప్రతినిధీ తన్ను ఎన్ను కొన్న ప్రజలకు కేవలం ఒక బాకాగా ఉంటాడన్న మాట. కాబట్టి సోవియట్ల కార్యకలాపాల్లో ప్రజలంతా ప్రత్యక్షంగా పాల్గొన్నట్టు కనిపిస్తుంది. అంటే సమస్త రాజ్యవ్యవహారాలను ప్రజలు ప్రత్యక్షంగా నడుపుతున్నట్టు కనిపిస్తుంది.

కాని, ప్రాథమిక స్థితిలో వున్న నాగరిక సమాజంలో ఇటువంటి నమూనాకు బొత్తిగా అవకాశం లేదనేది స్పష్టమే. ఎందువల్లనంటే, అలాంటి సమాజంలో ఎల్లప్పుడూ నిర్దిష్ట ప్రయోజనాలు గల వివిధ బృందాలు ఉంటాయి. అవి ఆస్తికో, జాతికో, వర్గానికో మరి దేనికో సంబంధించిన ప్రయోజనాలు కావచ్చు. అందువల్ల ప్రజలందరి సమిష్టి, ఏకైక సంకల్పం రూపొందేందుకు ఇది అవరోధం. పైన పేర్కొన్న నమూనాను ప్రవేశ పెట్టడానికి, ఈ ప్రయోజనాలనుండి ప్రజలను వేరు చేయడం అవసరం. ఈ ప్రయోజనాలనన్నిటినీ ఒక విధమైన సర్వోన్నత ప్రయోజనంలో తమ వ్యక్తిగత స్వభావాన్ని కోల్పోయేలా చేయడం అవసరం.

అన్ని సామాజిక, జాతీయాది బృందాలకు అకస్మాత్తుగా ప్రాతినిధ్యం వహించింది రాజ్యమే గనుక, ఒక ఉమ్మడి, ఏకైక సంకల్పాన్ని రూపొందించే అవకాశం దానికి కలిగింది. బహువిధ ప్రయోజనాలు ఈ విధమైన సంకల్పాన్ని రూపొందించే యంత్రాంగంలో కిందినుంచి జొరబడ కుండా నివారించేందుకు తగిన పరిస్థితులను రాజ్యం సృష్టిస్తేచాలు. అప్పుడు నిర్ణయాలు చేసే క్రమంలో వాస్తవ జీవితానికి ప్రమేయం ఉండదు.

సామాజికవర్గ, జాతీయ ప్రధాన సమస్యలన్నీ పరిష్కారమైనట్లు ప్రకటించడం జరిగింది. ఈ ప్రకటన ప్రజల, ఆయా బృందాల చైతన్యంలో భాగమైంది. దానితో అన్ని చిక్కులు తొలగిపోయాయి. ఆదర్శ ప్రాయమైన దేశవ్యాప్త స్వయంపాలన పని చేయనారంభించింది. అయితే, జీవితంతో ఎట్టి సంబంధంలేని వ్యవస్థ అది. ఇక ప్రజల సంగతికి వస్తే, వారు తాము ఎన్నుకొన్న సంస్థలను పట్టించుకోలేదు. అన్ని సోవియట్లను ఒక్కసారిగా రద్దుచేసినా ప్రజలు ఆ విషయం పట్టించుకుని వుండేవారు కాదేమో!

పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి పరివర్తన సంగతిని తిరిగి ఎత్తుకొందాం.

సోషలిస్టు సమాజంలో రాజకీయ అధికారాన్ని

## సమాజమూ, రాజ్యము

ఫలప్రదంగా వ్యవస్థీకరించడానికి మార్క్సిస్టు రాజకీయ సిద్ధాంతం కొన్ని కీలక ప్రశ్నలకు సమాధానం ఇవ్వాలి: ఎవరు పాలించాలి? ఎలా పాలించాలి? ఓటర్లకూ, వారి ప్రతినిధులకూ మధ్య సంబంధం ఏమిటి? శాసన నిర్మాణ సంస్థలకు ఎవరు ఎన్నికకావాలి?

దేశాన్ని పాలించవలసింది ప్రజలే అని బూర్జువా సిద్ధాంతం చెబుతోంది. ఐతే, ముఖ్యమైన రాజకీయ నిర్ణయాలు చేయడంలో యావన్మంది ప్రజలూ పాల్గొనలేరు కాబట్టి ప్రజలు తాము ఎన్నుకున్న ప్రతినిధుల ద్వారా దేశాన్ని పాలిస్తారు. అమెరికా మొదలైన పాశ్చాత్యదేశాలు ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టాయి. అయితే, ఆధునిక కాలంలో ఈ రాజకీయ కార్యాచరణ అనేక సమస్యలనూ, చిక్కులనూ తెచ్చిపెట్టింది. వాటిని బూర్జువా రాజకీయశాస్త్రం యింత వరకూ పరిష్కరించలేదు.

మార్క్సిస్టు రాజకీయ సిద్ధాంతం కూడా సర్వాధికారానికి ప్రజలే మూలకందమని నమ్మతోంది. కాని, విప్లవానంతర సోషలిస్టు సమాజంలో అధికారాన్ని రూపొందించే నిర్దిష్ట యంత్రాగాన్ని మార్క్సిజం మూలపురుషులు వివరించ లేదు . పారిస్ కమ్యూన్ అనుభవాన్ని గురించి మార్క్స్ చేసిన నిర్దిష్ట విశ్లేషణ ఆధారంగా మార్క్సిస్టు సార్వత్రిక సూత్రాలను ఆచరణలో అమలుజరపడానికి కొందరు ప్రయత్నించినప్పుడు దానివల్ల వారికి కీడే జరిగింది.

గ్రీకుల నగర పాలనా ప్రజాస్వామ్య సూత్రాలకూ, రూసో సూచనల ననుసరించి వున్నరాజకీయ నిర్మాణ సూత్రాలకూ దగ్గరగా ఉండే సూత్రాలపై పారిస్ కమ్యూన్ నెలకొల్పబడింది. నగరాన్ని సైన్యం చుట్టు ముట్టిన పరిస్థితిలో, పరిమిత సంఖ్యలో వున్న ప్రజల భాగాస్వామ్యంతో, బహు తక్కువ కాలంపాటు ఉత్పత్తిదారును ప్రభుత్వం నుండీ వేరుచేయని పాలనా వ్యవస్థను కమ్యూన్ నెలకొల్ప గలిగింది. వ్యక్తినీ, సమాజాన్నీ రాజ్యాన్నీ కమ్యూన్ తాలూకు సామాజిక వ్యవస్థలో తిరిగి ఐక్యపర్చడం జరిగింది.

అది ఆచరణలో ఇలా ఉండింది. వివిధ పేటల ప్రతినిధులు ప్రజల డిమాండ్లను కమ్యూన్ మండలికి తెలిపేవారు. మండలి నిర్ణయాలు చేసేది. దాని సభ్యులు వాటిని అమలు జరిపి, ఆ విషయం మండలికీ, ప్రజలకూ నివేదించేవారు. అయితే మండలిలో వారివని వారిని వృత్తి రాజకీయవేత్తలుగా మార్చలేదు. ఎందుకంటే వారు మునుపటిలాగే హస్తకళాకారులుగా, ముద్రాపకులుగా, వ్యాపారస్థులు, లేక పెయింటర్లుగా ఉండిపోయారు. కమ్యూన్‌కు ప్రాతినిధ్య సంస్థలు ఉండినా, ఒక ప్రత్యేకవ్యవస్థగా పార్లమెంటరీ విధానంగానీ, శాసన నిర్మాణానికీ, వాటిని అమలు జరిపే పనికీ మధ్య విభజన గానీ, ప్రతినిధులకు ప్రత్యేక హక్కులతో కూడిన ప్రతిపత్తిగానీ లేవని లెనిన్ చెప్పారు.

ప్రాతినిధ్య రూప ప్రభుత్వ సమస్యలన్నిటినీ కమ్యూన్ పరిష్కరించింది. ప్రభుత్వ ఫలదాయకతను మెరుగు పర్చడానికీ, ఒక వ్యక్తి చేతిలో అధికారం కేంద్రీకృతం కాకుండా నిరోధించడానికీ, వ్యక్తి హక్కులకూ, స్వేచ్ఛలకూ హామీ నివ్వడానికీ అవసరమైన యంత్రాంగాన్ని సృష్టించడంలో వేలాది సంవత్సరాల అనుభవాన్ని కమ్యూన్ త్రోసి పుచ్చిందంటే, అందులో ఆశ్చర్యమేమీ లేదు.

తీవ్రమైన పరిస్థితుల్లో రూపుగొన్న కమ్యూన్ మార్గం సార్వత్రికమైనదీ, దేశవ్యాప్తంగా విస్తరించదగినదే అన్న భ్రమతో సోవియట్ యూనియన్ ఈ మార్గం చేపట్టడం విచారకరం.

సోవియట్లలో కార్మికుల, రైతుల, సైనికుల ప్రాతినిధ్యం అనే ఆలోచన యెంతో ముఖ్యమైనది. తక్షణ సమస్యలపై తమ అభిప్రాయం వ్యక్తం చేసే అవకాశం ప్రజా ప్రతినిధులకు లభించింది. వారి అభిప్రాయాలు ప్రజల ఉమ్మడి అభీష్టమని చెప్పవచ్చు. దీన్ని

# సమాజమూ, రాజ్యము

వ్యక్తీకరించడం ద్వారా కొత్త ప్రభుత్వం మౌలికంగా నూతన నిర్ణయాలకు చట్టపరమైన శక్తినిచ్చింది.

ఈ నిర్ణయాలు ముఖ్యమైన సమస్యలపై ఒక రకమైన ప్రజాభిప్రాయ సేకరణ వంటివి. నేడు అన్ని రాజకీయ వ్యవస్థలు ప్రజాప్రభుత్వ సూత్రం ప్రాతిపదికపై ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతున్నాయి. అయితే అతి చిన్న సాకుతో, ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని ఎవరూ అనరు. నేటి శాసన నిర్మాణ పరమైన, కార్య నిర్వహణ పరమైన సమస్యలపై నిర్ణయాలను, నిరంతరం పని చేసే అధికార ప్రాతినిధ్య సంస్థలు చేస్తున్నాయి; కార్య నిర్వాహక సంస్థల కార్యకలాపాలు వీటి అదుపులో ఉన్నాయి.

కాని సమావేశాల కాలంలో సోవియట్ల కార్యకలాపాలు ప్రజాభిప్రాయ సేకరణలుగా మారిపోయాయి. వీటి సభ్యులు ఇతరుల నిర్ణయాలను ఆమోదించాల్సి వస్తోంది.

అదే సమయంలో సోవియట్ సమాజం ఉన్నత ప్రభుత్వ సంస్థల వ్యవస్థీకరణలో ప్రాతినిధ్య రూపాన్ని త్యజించలేదు. కాని, ప్రజా ప్రతినిధి ఉమ్మడి అభీష్ట వ్యక్తీకరణకూ, ప్రత్యక్ష ప్రజాస్వామ్యానికి హామీనిచ్చే యంత్రాంగంలో ఒక భాగం మాత్రమే అయిపోయాడు. సామాజిక జీవితంలోని ముఖ్య సమస్యలపై బిల్లులను సమర్పించే అధికారం అతనికి లేకుండా పోయింది. కార్య నిర్వాహక సంస్థల కార్యకలాపాలపై అతనికి అదుపు లేదు. వర్తమాన రాజకీయ క్రమాల్లో పాల్గొనే అవకాశం అతనికి లేదు. తన ఓటర్ల ఆదేశాలను పాటించే విధి మాత్రమే అతనికి మిగిలిపోయింది. సమాజ ప్రయోజనాల నిమిత్తం తన ఓటర్లలో కొందరి ప్రయోజనాలను యెప్పుడు త్యాగం చేయాలో, యెప్పుడు వారి ప్రయోజనాల కోసం సమాజప్రయోజనాలు త్యాగం చేయాలో నిర్ణయించుకునే స్వేచ్ఛ అతనికి లేకుండా పోయింది. యింకా యిలాంటి వెన్నో ఉన్నాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే ప్రతినిధికి ఏ స్వేచ్ఛా లేకుండాపోయింది. ఇందువల్ల, రాజకీయ వ్యవస్థలో అతనికి తగిన స్థానం లేకుండా పోయింది. శాసన నిర్మాణ అధికార రంగం, తనకు సంబంధించని కార్యకలాపాల రంగం అయిపోయింది. మొదట రాచరిక వ్యవస్థల్లో, తరువాత పాశ్చాత్య ప్రజాస్వామ్యాల్లో శతాబ్దాల తరబడి అది చేకూర్చుకొన్న శాశ్వత విధులూ, హక్కులూ దానికి శూన్యం అయిపోయాయి.

సోవియట్ సమాజం ప్రత్యక్ష, ప్రాతినిధ్య ప్రజాస్వామ్య సూత్రాల మధ్య సామరస్యాన్ని తీసుకు రాలేదు. ఫలితంగా సోవియట్ యూనియన్‌లోని రాజకీయ వ్యవస్థలో గనికార్మికులు మొదలుకొని డాక్టర్లు, నటీనటులు మొదలైన సమస్త జీవితరంగాలవారు ఏడాదిలో కొన్ని రోజుల పాటు సోవియట్ల సమావేశాల్లో పాల్గొంటూ, కార్యనిర్వాహక సంస్థల అధికారులు నివేదించిన నిర్ణయాలను ఆమోదించడం ద్వారా సమాజ ఉమ్మడి అభీష్టాన్ని వ్యక్తం చేస్తుంటారు. సోవియట్ యూనియన్‌లో శాసన నిర్మాణధికారం ప్రాథమిక దశలో ఉంది.

కాబట్టి, అధికారమంతా కార్య నిర్వాహక సంస్థల చేతుల్లో కేంద్రీకృతమై ఉంది. ఇవి ఎన్నికైనవీ కావు. ఎవరికీ జవాబుదారీగా ఉన్నవీ కావు. ఈ విధంగా, వాస్తవం, సిద్ధాంత నిర్ణీత లక్ష్యానికి పూర్తి వ్యతిరేకంగా తయారయింది.

ఈ పరిస్థితినుంచి బయటపడే మార్గమేమిటి? వివరాల్లోకి పోకుండా ఒక విషయం చెప్పగలం. నాగరిక సమాజ సంస్థలను నెలకొల్పి రాజ్యాన్ని వాటికి లోను చేసే సమూలమైన ఆర్థిక రాజకీయ సంస్కరణ ఒక్కటే మార్గం. ఇందుకు రాజ్య వ్యవహారాల నిర్వహణలో ప్రత్యక్షంగా పాల్గొనడమే ప్రజాధికారానికి అర్థ

(మిగతా 24 వ పేజీలో)

# నూతన రాజకీయ ఆలోచనాధోరణి: అంతరిక్ష పరిశోధనలో అంతర్జాతీయ సహకారం



**అలెక్సాండ్ర్ ధునాయేవ్**

సోవియట్ వాణిజ్య అంతరిక్ష సంస్థ
గ్లావ్‌కాస్మాస్ అధిపతి

అంతరిక్ష అన్వేషణలో అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడానికి నిరంతరం కృషిచేస్తున్న సోవియట్ యూనియన్, దూరరోదసి అన్వేషణలో, దాని శాంతియుత వినియోగాలలో సహకరించుకునేందుకు గతరెండేళ్లలో ఫిన్లాండ్, బ్రిటన్, ఆస్ట్రేలియా, బ్రెజిల్, అమెరికా, ఆస్ట్రియా, ఇటలీ, భారతదేశాలతో ద్వైపాక్షిక ఒప్పందాలను కుదుర్చుకుంది. తన బూస్టర్ రాకెట్లతో యితర దేశాల పౌర అంతరిక్ష వాహనాలను ప్రయోగించడానికి సోవియట్ యూనియన్ సంసిద్ధతను వ్యక్తపర్చింది; దూరరోదసి అన్వేషణలో తాను సాధించిన విజయాలను యితర దేశాలతో పంచుకోడానికి సిద్ధంగా వున్నానని తెలిపింది. ఒప్పందాలకోసం సంప్రతింపులు జరుగుతున్నాయి. 1991 చివర్లో - 1992 ప్రారంభంలో ఆస్ట్రియాతో సంయుక్త వాణిజ్య అంతరిక్ష యాత్ర జరపడానికి సంబంధించిన ఒప్పందంపై 1988 నవంబరులో వియన్నాలో సంతకాలు జరిగాయి.

అమెరికన్ పేలోడ్ వ్యవస్థలను వినియోగించుకునే ఒప్పందం కుదుర్చుకున్నాం. 1989 లో మీర్ అంతరిక్ష కేంద్రంలో కొత్తమందులకు అవసరమైన ప్రొటీన్ స్ఫటికాలను తయారుచేయడానికి యీ వ్యవస్థలను వినియోగించడం జరుగుతుంది.

ఎంతో ఖర్చుతో కూడిన, ఎంతో కీలకమైన యీ శాస్త్ర, సాంకేతిక శాఖ అభివృద్ధి ఒక అంతర్జాతీయ స్వరూపాన్ని సంతరించుకుని, ప్రతిఒక్క దేశం సాధించిన విజయాలను సాధ్యమైనంత యెక్కువ ప్రయోజనకరంగా వినియోగించుకునేందుకు వీలు కల్పించింది. కాని ప్రాచ్య-పాశ్చాత్య సంబంధాలు క్షీణ స్థాయికి చేరుకున్నప్పుడు అలాంటి సహకారానికి గల అన్ని అవకాశాలను వినియోగించుకోకుండా ఎగుమతి నియంత్రణా సమన్వయ కమిటీ (కోకమ్) పరిమితులు విధించింది. కోకమ్

విధించిన పరిమితుల వల్ల అమెరికా కృత్రిమ ఉపగ్రహాన్ని సోవియట్ ప్రోటాన్ బూస్టర్ రాకెట్‌తో ప్రయోగించలేక పోతున్నామని అంతరిక్ష వాణిజ్య కార్పొరేషన్ అధ్యక్షుడు హ్యూస్టన్‌లో ప్రకటించాడు.

పరిమితులకు స్వస్తి చెప్పి, సమాన స్థాయి భాగస్వాములకు తగినట్టు సంబంధాలను నెలకొల్పుకోవడం వల్ల ఉభయ పక్షాలకు సమాన ప్రయోజనాలు ఒనకూడుతాయని నేననుకుంటున్నాను. నూతన ఆలోచనా విధానాన్ని వ్యోమగాములు నానాటికీ యెక్కువగా బలపరుస్తున్నారు. అంతరిక్షాన్ని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించుకునేందుకు సహకరించుకోవాలని ఐ.రా.సలో గోర్బచేవ్ చేసిన విజ్ఞప్తి యీ సందర్భంగా ప్రత్యేకించి ముఖ్యమైనది. ఐ.రా.స. ఆధ్వర్యాన అత్యవసర పర్యావరణ సహాయ కేంద్రాన్ని యేర్పాటు చేయాలని సోవియట్ నాయకుడు ఒక ప్రతిపాదన చేశారు. అంతరిక్ష సాంకేతిజ్ఞతలు యీ కేంద్రానికి అవసరం. సమాచార సేకరణ కోసం యిలాంటి కేంద్రానికి కృత్రిమ వుపగ్రహాలు కావాల్సి వుంటుంది. పర్యావరణ కార్యక్రమాలకు ప్రస్తుతమున్న స్థాయిలో కన్నా మరింత అధునాతన వాతావరణ, పరిసరాల పరిశీలక అంతరిక్ష వాహనాలు అవసరం. సమాచారాన్ని సేకరించి, వడబోయడానికి వీటన్నిటినీ ప్రపంచస్థాయి వున్నత వుపగ్రహాల వ్యవస్థతో, భూతల కేంద్రాలతో అనుసంధించాల్సి వుంటుంది.

కానీ అలాంటి వ్యవస్థ యెంతో ఖర్చుతో కూడుకున్నది. భవిష్యత్ వ్యవస్థకు సంబంధించిన కొన్ని భాగాలను యిదివరకే అభివృద్ధి చేయడం జరిగింది. వీటిలో కొత్తతరం వాతావరణ, పరిసరాల మానవ సహిత, మానవరహిత, అంతరిక్ష నౌకలు వున్నాయి. మీర్ అంతరిక్ష కేంద్రంతో 1991 లో కొత్త మాడ్యూల్‌ను అనుసంధించ తలపెట్టాం. సోవియట్ యూనియన్, ఫ్రాన్స్, ఐదు సోషలిస్టు దేశాలు అభివృద్ధిచేసే మూడు టన్నుల పరికరాలను యిది తీసుకెళ్లుతుంది. భూమిని, సముద్రాలను, ఖండాల వాతావరణాన్ని పరిసరాలపై మానవుని కార్యకలాపాల ప్రభావాన్ని అధ్యయనం చేయడానికి వ్యోమగాములు యీ కొత్త మాడ్యూల్‌ను వినియోగిస్తారు. పరిసరాలను పరిశీలించే భావి అంతరిక్ష ప్రయోగశాల నమూనా యిది.

ఐ.రా.స. వేదికనుండి ప్రతిపాదించబడిన ప్రపంచ అంతరిక్ష సంస్థ అలాంటి కృషికి పూనుకోవాలి. అన్ని దేశాల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని అది అంతరిక్ష అన్వేషణలకు, నిర్దిష్ట అంతర్జాతీయ ప్రాజెక్టులకు ప్రాధాన్యతా క్రమాలను నిర్ణయించగలదు. అంతరిక్షాన్ని శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే వినియోగించుకునేట్టు అది చూడగలదు.

అంతరిక్షంలో ఆయుధ పోటీ నివారణకు సంబంధించిన ఒప్పందాల పాటింపును అజమాయిషీ చేసేందుకు ప్రపంచ అంతరిక్ష సంస్థలో అంతర్జాతీయ తనిఖీ విభాగాన్ని ఏర్పాటు చేయాలి. యీ సంస్థ ఆధీనంలో గల సాంకేతిక సదుపాయాలతో గానీ, సభ్య దేశాల నుండి అరువుకు, అద్దెకు తీసుకున్న సాంకేతిక సదుపాయాలతో గానీ యీ తనిఖీ చేయవచ్చు.

అంతరిక్షాన్ని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించుకోడానికీ, అన్వేషించడానికీ యితర రాజ్యాలతో, అంతర్జాతీయ సంస్థలతో, విదేశీ సంస్థలతో వాణిజ్య ప్రాతికతో సహా అన్ని విధాలా సహకరించడానికి సోవియట్ యూనియన్ సిద్ధంగా వుంది. అంతరిక్ష పరిశోధనలో వ్యవహారసరళి సహకారం—యిది వ్యోమగాములు సాధించిన విజయాలు మానవాళి ప్రయోజనానికి తోడ్పడడానికీ, దేశాలమధ్య పరస్పర అవగాహనకు, విశ్వాసానికి దోహదం చేయడానికీ వీలు కల్పిస్తుందనే నమ్మకంతో మేము ముందుకు సాగుతున్నాం.

(ప్రావ్దా నుండి)

# మార్క్సిజమూ,

జి. లిసిచ్కిన్

(గతసంచిక తరువాయి)



అన్యాయాలన్నిటికీ మూలబీజం, ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యమేనని చాలాకాలం క్రితంనుండే మానవుడు ఊహించనారంభించాడు. ఒకవైపు పేదరికమూ, మరోవైపు ఐశ్వర్యం, ఒకవైపు ఆకలిమంటలూ, మరోవైపు తిండిపోతుతనం, ఒకవైపు హక్కుల రాహిత్యమూ, మరోవైపు రాజకీయ దమన కాండ పెచ్చుపెరిగిపోవడానికి ప్రాతిపదిక ప్రైవేటు ఆస్తే. ప్రపంచాన్ని సామాజిక న్యాయపాలన కిందికి తెచ్చేందుకు అనేకమంది తత్వవేత్తలూ, విప్లవకారులూ ప్రైవేటు ఆస్తిని రద్దు చేయాలని డిమాండ్ చేశారు.

ప్రైవేటు ఆస్తికి నైతికరీత్యా గల అన్యాయ స్వభావాన్ని మార్క్సిజం గుర్తించిన విషయం తెలిసిందే. అయితే, రాజకీయ పద్ధతులతో కాక ఆర్థిక పద్ధతులతో ప్రైవేటు ఆస్తిని అధిగమించడం ఇలాంటి సామాజిక అన్యాయాన్ని వదిలించుకునే మార్గమని మార్క్సిజం భావిస్తోంది.

ఉదాహరణకు, తన పట్టణంలో ఇటీవలే నెలకొల్పబడిన బూట్ల ఫ్యాక్టరీ వివిధ అభిరుచులను సంతృప్తిపర్చే బూట్లను చౌకగా తయారు చేయడం ప్రారంభించడంవల్ల సొంతంగా వాటిని తయారుచేసే ముచ్చికి పనిలేకుండా పోతుంది.

బూట్ల ఫ్యాక్టరీలోని సామాజికీకృత శ్రమకు ఎక్కువ ఉత్పాదకత ఉండటంవల్ల, అది వ్యక్తిగత శ్రమను సహజరీతిలో అంతరింపజేస్తోంది. ఈ కారణంవల్ల ప్రైవేటు ఆస్తి భవితవ్యం విషయంలో మార్క్సిజం చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తుంది. "తాను తగినంత అవకాశం కల్పిస్తున్న సమస్త ఉత్పాదక శక్తుల అభివృద్ధి స్తోమత పూర్తిగా హరించుకపోయేవరకూ యేఒక్క సామాజిక వ్యవస్థ కూడా అంతరించిపోజాలదు. అతిపాత సమాజమైనా సరే, దాని గర్భంలో, మరింత అభివృద్ధి చెందిన నూతన ఉత్పాదక సంబంధాల అస్తిత్వానికి పాదార్థిక పరిస్థితులు రూపుగొనకముందే, ఆ సంబంధాలు అస్తిత్వంలోకి రాజాలవు," అని మార్క్స్ రాశారు.

మానవ జీవితంలో తన నాగరీకరణ పాత్రను నిర్వహించడం పూర్తయ్యే వరికూ ప్రైవేటు ఆస్తి కేవలం శాపమేగాదు, గొప్ప వరం కూడా.

ప్రైవేటు ఆస్తి భవితవ్యం గురించిన మార్క్స్, ఎంగెల్స్‌ల అవగాహన అదీ. వారికే అధికారముంటే, ప్రైవేటు ఆస్తికి ఇక నూకలు నిండాయనీ, పోటీ పడగల శక్తి యికదానికి లేదనీ, దానికి కాలదోషం పట్టిందనీ తమకు

నమ్మకం కలిగేవరకు దాన్ని జాతీయం చేసి వుండేవారు కాదు.

అందువలనలెనిన్ ప్రైవేటుఆస్తిని చరిత్రాత్మక గౌరవభావంతో చూడటం సహజమే. అలాంటప్పుడు అక్టోబర్ విప్లవం జరిగిన వెనువెంటనే, బడుగు దేశమైన రష్యాలో ఒక్క రైతుల ఆస్తిని తప్ప, మిగతా ప్రైవేటు ఆస్తిని అంత తొందర పాటుతో రద్దు చేయడం ఎందుకు జరిగింది? ప్రైవేటు ఆస్తి తన స్తోమతను పూర్తిగా ఉపయోగించుకోకముందే, యూరప్‌లో కన్నా అమెరికాలో కన్నా దాని వినియోగం తక్కువ స్థాయిలో ఉన్నప్పుడే ఇది జరిగింది.

ఇది అంతపెద్ద ఎత్తున బోల్షివిక్కుల ప్రణాళికా బద్ధమైన చైతన్యయుతమైన విధానాల ఫలితంగా గాక, అప్రయత్నంగా జరిగింది. ఏదియేమైనా, లెనిన్ అభీష్టానికి వ్యతిరేకంగా జరిగింది. బోల్షివిక్ పార్టీ అధికారంలోకి రాగానే, అది అమలుపెట్టాల్సిన కార్యాచరణ కార్యాక్రమం "ఏప్రిల్ థీసీస్" (1917 ఏప్రిల్ 3) అసలు పాఠంలో లెనిన్ ఒకే ఒక్క రంగంలో మాత్రమే, అంటే భూస్వాముల ఆస్తిని మాత్రమే రద్దు చేయాలని సూచించారు.

సోషలిస్టు విప్లవం దిశలో పార్టీని నడిపినప్పుడు ఆయన ఇలా హెచ్చరించారు: "సోషలిజంను వెన్వెంటనే ప్రవేశపెట్టరాదు. పద్ధతి ప్రకారం, క్రమేణా, సామాజిక ఉత్పత్తి, ఉత్పత్తుల పంపిణీల నియంత్రణకు పరివర్తనను వెంటనే శ్రామిక డిప్యూటీల సోవియట్లు తీసుకు రావాలి."

"ఏప్రిల్ థీసీస్" మరింత సరియైన నిర్వచనాన్నిచ్చింది. "సోషలిజాన్ని ప్రవేశపెట్టడం మనతక్షణ కర్తవ్యం కాదు. సామాజిక ఉత్పత్తినీ, సామాజిక ఉత్పత్తుల పంపిణీనీ వెంటనే శ్రామికుల డిప్యూటీల నియంత్రణ కిందికి తీసుకు రావడం మాత్రమే మన కర్తవ్యం."

> దయ్యాలు
> జపం
> చేస్తున్నాయి
> జాగ్రత్త
>
> ఒక పోలిష్ నానుడి.

ప్రవేశ పెట్టవలసి ఉన్న సోషలిజం తాలూకు ఆర్థిక ప్రాతిపదిక లోపించిందన్న విషయం చూడగలిగేంత వాస్తవిక దృష్టిని, లెనిన్ సోషలిస్టు విప్లవాన్ని సన్నాహాలు చేయడంలో ప్రదర్శించారు.

నిజమైన మార్క్సిస్టుగా ఆయనకు, వేరే పద్ధతుల్లో పరిష్కరించ వీలున్న సమస్యలను బలప్రయోగంతో పరిష్కరించే యోచన లేదు. ఉత్పత్తి ఎంతో కేంద్రీకృతమైన కొన్ని రంగాల్లో ప్రైవేటు ఆస్తిని రద్దు చేసే యోచన ఉండింది. బ్యాంకింగు యిందుకొక ఉదాహరణ.

అక్టోబర్ విప్లవం విజయవంతమైన వెన్వెంటనే, బ్యాంకులు, రైల్వేలను జాతీయం చేసినప్పుడు, శ్రామికుల తనిఖీ సంస్థల నియంత్రణకింద సమస్త ప్రైవేటు వ్యాపారాలు సజావుగా నడవడానికి హామీనిచ్చే ప్రయత్నం జరిగినప్పుడు లెనిన్ వివిధ ప్రైవేటు ఆస్తుల పట్ల జాగరూకతతో, వాటి మధ్య తేడాచూపే ఈ సైద్ధాంతిక వైఖరిని ప్రదర్శించారు.

ఈ ప్రయత్నం విఫలమైంది. యిందుకు ప్రధాన కారణం అంతర్యుద్ధం ప్రజ్వరిల్లడం, బూర్జువా వర్గమూ, బ్యూరాక్రాట్లూ చేసిన ద్రోహం. ద్రోహం అనేది శాంతి కాలంలో సైతం శిక్షించి తీరాల్సిన నేరం. విప్లవ కాలంలో దీనిగురించి

వేరే చెప్పనవసరం లేదు. బూర్జువా వర్గానికి విధించిన కొన్ని శిక్షల్లో ఒకటి జాతీయకరణా, ఆస్తిని స్వాధీన పరచుకోవడమూను.

ఆ అల్లకల్లోల కాలంలో వాటి పూర్వపు యజమానులు ఎక్కడిదక్కడ వదిలి పోయారు. ప్రభుత్వరంగాన్ని విస్తరించడానికి సోవియట్ ప్రభుత్వం సన్నద్ధంగా లేకపోయినా ద్రోహుల ఆస్తీ, ఉత్పత్తి సాధనాలూ, సోవియట్ ప్రభుత్వం చేతుల్లోకి వచ్చాయి.

వివాదగ్రస్తమైన ఆ కాలంలో ఉత్పత్తిరంగ ఆర్థిక సామాజికీకరణ కన్నా ముందుగానే దాన్ని చట్టరీత్యా సామాజిక పరం చేయకుండా లెనిన్ జాగ్రత్త వడ్డారు. ప్రభుత్వ రంగాన్ని విస్తరింప చేయడానికి సోవియట్ ప్రభుత్వం ఆనాడు సిద్ధంగా లేదంటే దానికొకే కారణ ముంది—దాన్ని నిర్వహించే శక్తి ఆనాడు ప్రభుత్వానికి లేదు. అందువల్లనే ఆయన, పనిచేయకుండా నిలిచిపోయిన ఫ్యాక్టరీలను గురించి ఫిర్యాదు చేయడానికి వచ్చిన కార్మిక ప్రతినిధులతో ఇలా చెప్పేవారు: "మీ ఫ్యాక్టరీని ప్రభుత్వ స్వాధీనం చేసుకోవాలని మీ కోరిక. మంచిది. డిక్రీల ఖాళీ ఫారాలు మావద్ద సిద్ధంగా ఉన్నాయి. వాటిపై సంతకం చేయ డానికి క్షణం కూడా పట్టదు. కానీ, ఒక సంగతి చెప్పండి: ఉత్పాదనను ఎలా మీ చేతుల్లోకి తీసుకోవాలో మీకు తెలుసా? ఏమి ఉత్పత్తి చేయాలో మీరు లెక్క వేశారా? మీరు ఉత్పత్తి చేస్తున్న దానికీ, రష్యన్, అంతర్జాతీయ మార్కెట్లకూ మధ్య గల సంబంధం గురించి మీకు తెలుసా?" ఇవేవీ వారికి తెలీవని తేలడంతో ఆ ఫ్యాక్టరీలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోలేదు. బోల్షెవిక్కుల, మెన్షెవిక్కుల కరపత్రాలలోఈ విషయాలేవీ లేవని లెనిన్ చెప్పారు.

ఇటువంటి వాస్తవాలనూ, ఉత్పత్తిరంగ ఆర్థిక సామాజికీకరణ చాలా తక్కువ స్థాయిలో ఉన్న పరిస్థితినీ దృష్టిలో ఉంచుకొని లెనిన్, ప్రైవేటు ఆస్తి జాతీయకరణను త్వరితం చేయలేదు. 1917 అక్టోబరు నుంచీ 1918 ఆకురాలు కాలం వరకూ సాగిన కొద్దిపాటి శాంతి కాలంలో లెనిన్, తమతో సహకరించడానికి సిద్ధమైన ఆర్థిక శక్తులతో మామూలు సంబంధాలను నెలకొల్పడానికి సాధ్యమైనదంతా చేశారు.

శ్రామికరైతుల ప్రైవేటు ఆస్తి విషయంలో, నిజమైన మార్క్సిస్టు వైఖరి యేమిటో లెనిన్ స్పష్టం చేశారు: "...రైతులపైన సోషలిజాన్ని బలవంతాన రుద్దడం సాధ్యం కాదు. ఆదర్శబలం పైన మాత్రమే, దైనందిన అనుభవాన్ని రైతు బాహుళ్యం జీర్ణించు కోవడం పైనమాత్రమే మనం ఆధారపడాలి."

పెట్టీ బూర్జువా వర్గం సంగతికి వస్తే, సోషలిజానికి పాదార్థిక ప్రాతిపదికను సృష్టించే ప్రయత్నంలో అది పాల్గొనడానికి తోడ్పడ గల వైఖరిని లెనిన్ రూపొందించారు. ఆయనిలా రాశారు: "పెట్టీ బూర్జువా వర్గంతో ఒప్పందం చేసుకొనేది, బూర్జువా ప్రజాతంత్ర విప్లవం లో ఐక్య సంఘటన కోసం కాదు; సోషలిస్టు విప్లవ కర్తవ్యాలను పరిమితం చేసేందుకు కాదు. పెట్టీ బూర్జువా వర్గంలోని వేరువేరు విభాగాలు సోషలిజానికి పరివర్తన చెందే రూపాల కోసం మాత్రమే."

1918 వసంత రుతువులో సోవియట్ ప్రభుత్వానికి ఊపిరి పోసుకునే అవకాశ మేర్పడ గానే లెనిన్, బూర్జువా వర్గం పట్ల అవలంబించ వలసిన వైఖరిని రూపొందించారు.

"బూర్జువా వర్గంపై మనం విధించిన నష్ట పరిహారాలకు బదులు, ఆస్తి పన్నును, రాబడి పన్నును క్రమానుసారం వసూలు చేయాలి. ఇది కార్మిక రాజ్యానికి ఎక్కువ ఫలదాయకమైనది. ఇందుకు మరింత చక్కని లెక్కాచారాన్ని అజమాయిషీని మనం ఏర్పాటు చేయడం అవసరం."

ఈ మాటలు కార్య రూపం ధరించాయి. 1918 జూన్ 17న ప్రజాకమిస్సార్ల సమితి జారీ చేసిన ఒక డిక్రీ బూర్జువా వర్గానికీ, సోవియట్ ప్రభుత్వానికీ మధ్య కొత్త సంబంధాలను నిర్దేశించింది. 1918 జూలై 1 నాటికి మన దేశంలోని 521 ఉత్పాదక సంస్థలు మాత్రమే జాతీయం చేయబడ్డాయి. సుమారు 100 వ్యాపార సంస్థలు- అంటే, దాదాపు 20 శాతం జాతీయం చేయబడ్డాయి.

అంతర్యుద్ధం, విదేశీ దండయాత్ర, నూతన ప్రభుత్వంతో రాజీపడలేక పోయిన రష్యన్ బూర్జువా వర్గ రాజకీయ అపరిపక్వత —వీటన్నిటి కారణంగా ఏర్పడిన పరిస్థితి వల్ల 1921 నాటికి ఉత్పత్తి రంగంలోని ప్రైవేటు ఆస్తిలోని ఎక్కువ భాగాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని జాతీయం చేసింది. ఇది నిజానికి ఆర్థిక చర్యకాదు. తప్పని సరియైన శిక్షాత్మకచర్య.

దేశంలో శాంతి నెలకొనడం ప్రారంభమైన వెంటనే లెనిన్ అక్టోబర్ విప్లవానంతరం తాను అమలు జరిపిన విధానాన్నే తిరిగి చేపట్టారు. నూతన ఆర్థిక విధానం అని నేడుదాన్ని పేర్కొంటున్నాము. బోల్షెవిక్కులు ఆదిలో తెలివి మాలిన పని చేసి తర్వాత తమ తప్పు సరిదిద్దుకున్నారన్న అభిప్రాయం ఇక్కడ కలగవచ్చు. ఈ అవగాహన సరికాదు. నూతన ఆర్థిక విధానం, విప్లవం వెనువెంటనే బోల్షెవిక్కులు అనుసరించ పూనుకొన్న విధానం తప్ప మరొకటి కాదని లెనిన్ పదేపదే నొక్కి చెప్పారు. ఆర్థిక విధానాలను గురించి ఒకవ్యాసం రాయతలపెట్టిన సోవియట్ ఆర్థిక వేత్త వై.ఎస్. వార్గాకు లెనిన్ రాసిన లేఖలో, సోవియట్ ప్రభుత్వ రాజకీయ పంథా అవిచ్ఛిన్నతను వివరిస్తూ, 1918 వసంతరుతువులో ''అతి వాదులకు'' వ్యతిరేకంగానూ, ''ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం'' గురించీ తాను రాసిన వ్యాసాల నుంచీ సాధ్యమైనంత విపులంగా ఉల్లేఖించవలసిందిగా చెప్పారు.

ప్రైవేటు ఆస్తివల్ల సంభవించే సామాజిక దుష్పరిణామాలను గుర్తిస్తూనే, లెనిన్ దాన్ని బలప్రయోగంతో, పరిపాలన సంబంధమైన చర్యలతో రద్దుచెయ్యడానికి తొందరపడలేదు. దానికి మారుగా సోషలిస్టు ఆస్తిగా మార్చే సహజ క్రమంలో దాన్ని ఇమిడ్చే మార్గాలను అన్వేషించారు.

ఈ అన్వేషణ ఫలితంగానే ఆయన ''ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం'' ఆర్థికంగా అప్పటి మన ఆర్థిక వ్యవస్థకన్నా అపారంగా ఉన్నతమైనది అనే నిశ్చయానికి వచ్చారు ప్రైవేటు ఆస్తి యొక్క ఆర్థిక సామాజికీకరణను త్వరితం చేయడానికి సహకార సంస్థలను ఉపయోగించుకో వీలుందని నిర్ణయించారు. అందువల్లనే నూతన ఆర్థిక విధానాన్ని ప్రారంభించిన తర్వాత లెనిన్, అంతకు ముందు జాతీయం చేసిన సంస్థలలో కొన్నింటిని ప్రైవేటు రంగానికి బదలాయించారు. అంతర్యుద్ధ కాలంలో ఆర్థిక ఆవశ్యకతను గురించి ఆలోచించకుండా అనేక వ్యాపార సంస్థలను ప్రభుత్వం తనచేతిలో ఉంచుకోవలసిన పరిస్థితి యేర్పడింది. విదేశీ పరిశ్రమ దారులకు రాయితీలిచ్చే సమస్యలను ఆయన లేవనెత్తింది కూడా యీ బదలాయింపుల సందర్భంలోనే.

లెనిన్ ప్రైవేటు ఆస్తిని అంతం చేయ తలపెట్టింది ఆర్థిక పద్ధతుల ద్వారా తప్ప, ప్రభుత్వ హుకుముల ద్వారా కాదు. ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తుల మధ్య ఆర్థిక పోటీకి అవకాశమిచ్చే విధానం మాత్రమే ఏది ఎక్కువ ఉత్పాదకమైనదో, ఎక్కువ లాభదాయక మైనదో నిరూపణ అవుతుందని, ఈ పోటీలో వీగిపోయినది రంగంనుంచీ నిష్క్రమిస్తుందని ఆయన అభిప్రాయం.

ఇది ఎలా యెప్పుడు సాధ్యమౌతుందన్న ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానం ఇవ్వడానికి ఆయన తొందరపడలేదు. అనుభవమే దీనికి సమాధాన మిస్తుందని ఆయన విశ్వాసం.

సోషలిజానికి ఒక పథకాన్ని తయారుచేసి పెట్టుకొన్న వారిని బోల్షెవిక్కులు అధికారంలోకి వచ్చిన తర్వాత 1918 మార్చిలో జరిగినపార్టీ 7 వ మహాసభలో లెనిన్ అందువల్ల ఖండించారు. ఈ పథకం వాస్తవానుభవం నుంచీ ఉత్పన్న మైందికాదు. మార్క్స్ రచనల్నూ, తదితర సాహిత్యంపై ఆధారపడినది. అయితేతాము చదివినదాన్ని వారు రష్యన్ వాస్త వికతలకు అనువర్తింప జేయడంలో విఫలమ య్యారు. మార్క్స్ ఎంగెల్స్ తదితరుల రచనలను లెనిన్ కూడా కూలంకషంగా అధ్యయనం చేసినవారే. కాని, వారి నిర్దేశనలను ప్రపంచ ప్రథమ సోషలిస్టు విప్లవం జరిగిన చారిత్రక పరిస్థితులకు యాంత్రికంగా, అనాలోచితంగా వర్తింపచేయడానికి లెనిన్ ఎన్నడూ ప్రయత్నించ లేదు.

ఆయన ఇలా అన్నారు: "సోషలిజం రూపు రేఖలను మనం వర్ణించ లేము. సోషలిజం సంపూర్ణ రూపం ధరించిన తర్వాత అది ఎలా ఉంటుందో మనకు తెలియదు."

సోషలిజానికి పరివర్తన చెందేందుకు ఎన్ని దశలున్నాయో మనకు తెలీదు, తెలుసుకోవడం సాధ్యమూ కాదు. సోషలిస్టు విప్లవం సోషలి జానికి సుదీర్ఘమైన, అంచెలంచెల మార్గాన్ని ఆవిష్కరించిందని లెనిన్ భావించగా, పార్టీ లోని ఆయన సహయోధులనేకులు సోషలిస్టు విప్లవం జరిగిన వెనువెంటనే, సోషలిజాన్ని నిర్మించడానికి పూనుకొనే సమయం వచ్చిందని భావించారు.

తదనంతర అనర్థాలకు ఈ అపోహే కారణ మైంది. ఉత్పత్తి సాధనాలపై పౌర యాజమాన్యం సోషలిజం ప్రధాన లక్షణమని, అందరి సోషలిస్టుల లాగానే, లెనిన్ కూడ దృఢంగా నమ్మారు. కాని, మార్క్సిస్టుగా ఆయన కేవలం జాతీయకరణ. జప్తుల ద్వారా సులభంగా సోషలిజాన్ని సాధించ వీలైనది కాదని కూడా విశ్వసించారు...

ప్రైవేటు ఆస్తిపట్ల స్టాలిన్ వైఖరి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల వైఖరికి పూర్తిగా భిన్న మైనది. దాన్ని ఒక చీడ పురుగుగా ఆయన భావించారు. దానికి గల అవకాశాలు పూర్తిగా హరించుక పోయాయా లేదా అనే దృష్టి ఆయనకు లేదు. అందువల్ల ఆయన తన హయాములో పారిశ్రామిక, వాణిజ్య, నిర్మాణ రంగాల్లోనే కాకుండా, ఆనాడు ఉత్పాదక శక్తులు సోషలిజానికి యేమాత్రమూ పరిపక్వంగా లేని వ్యవసాయ రంగంలో సైతం ప్రైవేటు ఆస్తిని తుడిచి పెట్టారు. స్టాలిన్ దృష్టిలో, ఏవిధమైన పౌర ఆస్తి అయినా సరే ప్రైవేటు ఆస్తి కన్నా సమర్థమైనది. "సోవియట్ యూనియన్‌లో వ్యావసాయిక విధానాల సమస్యలు" అన్న తన రచనలో ఇలా చెప్పారు. "ఖోల్హోజుల్లో రైతుల వ్యవసాయ పనిముట్లను కేవలం కలబోయడం, మన కార్యకర్తలు కలలోకూడా అనుకోని ఫలితమిచ్చింది. ఆ ఫలితమేమిటి? ఖోల్హోజులకు మారడం వల్ల పంట భూముల వైశాల్యం ముప్పై, నలభై, యాభై శాతం కూడా పెరిగింది."

స్టాలిన్ పంటపొలం విస్తరించిందని సంతో షించాడే కానీ, ఉత్పాదకత పెరిగిందని ఆయన చెప్పడంలేదు. "గొప్ప మార్పు వచ్చిన సంవత్సరం" అన్న తన రచనలో ఆయన "ఈ దేశం ప్రపంచంలోకెల్లా యెక్కువ ధాన్యం ఉత్పత్తి చేసే దేశాల్లో ఒకటవుతుంది" అని వాగ్దానం చేశారు.

ప్రైవేటు ఆస్తి యొక్క ఆర్థిక పరిపక్వతా స్థాయితో నిమిత్తం లేకుండా దాని పట్ల స్టాలిన్ అవలంబించిన వ్యతిరేక వైఖరి మార్క్సిస్టుల నుంచీ స్వీకరించింది కాదు. చారిత్రక అన్యా యాన్ని రూపు మాపడానికి చేయవలసిందల్లా

ప్రైవేటు ఆస్తిని రద్దు చేయడమే. అన్న జర్మన్ తత్వవేత్త డ్యూరింగ్ నుంచీ దీన్ని ఆయన అరువు తెచ్చుకున్నారు.

ప్రైవేటు ఆస్తివల్ల జరిగే అన్యాయాలకు, దాన్ని రద్దుచేయవలసిన అవసరమున్నదన్న నిర్ధారణతో ఎట్టి సంబంధం లేదని ఎంగెల్స్ అన్నారు. అలా రద్దు చేయడానికి ముందు, ప్రైవేటు ఆస్తి "సామాజికమైన మామూలు" పరిణామంగా ఉండటం ఆగిపోయిందని రుజువు కావాలి అన్నారాయన. దీన్ని స్టాలిన్ అర్థం చేసుకో లేక పోయారు. సహకార సంస్థలను ఉపయోగించుకోవడం ద్వారా స్వయం ఉపాధిగల వారిని శాంతియుత పద్ధతులతో సోషలిజం నిర్మాణక్రమంలోకి తీసుక రావచ్చునన్న లెనిన్ మాటను ఆయన ఉపేక్షించారు. ప్రైవేటు ఆస్తిని పౌర ఆస్తిగా మార్చే లెనిన్ పద్ధతిని ఆయన అర్థం చేసుకోలేదు. ప్రైవేటు ఆస్తి వ్యవస్థకు గల చారిత్రక విలువనే ఆయన గ్రహించలేదు. ఫలితంగా, లెనిన్ స్థాపించిన అన్ని రకాల సహకార సంస్థలనూ, ఆయన చనిపోయిన కొన్ని సంవత్సరాల్లోనే స్టాలిన్ తుడిచి పెట్టారు. అంతేకాదు. ఉత్పత్తి సామాజికీకరణ గురించిన తన సొంత అవగాహనకు అనుగుణంగా నెలకొల్పిన ఖోల్ఖోజులను

కూడా ఆయన అనుమానంతో చూచారు. అవి కమ్యూనిజానికి వెళ్ళే మార్గానికి ఆటంకాలుగా ఉన్నాయని "సోవియట్ యూనియన్‌లో సోషలిజానికి సంబంధించిన ఆర్థిక సమస్యలు" అన్న తన రచనలో బాహాటంగానే చెప్పారు.

దేశంలో ఉన్న సమస్త వస్తుసంపదను, అది ఎవరిదైనా సరే, కలబోసి, గతానుభవాన్ని గురించిన తన అవగాహనకు అనుగుణంగా దాన్ని నిర్వహించవలసిన అవసరం ఉందని స్టాలిన్ భావించినప్పుడు, సామాజికీకరణను గురించి ఆయన ఒక నిలకడైన వ్యాఖ్యే చేశారు. తన అవగాహనే "ప్రజల" అవగాహన అని ఆయన అభిప్రాయం. స్టాలిన్, ఆయన సహచరులు ఎటువంటి ఆస్తిపాస్తులు లేని లక్షోపలక్షల ప్రజలు ఉన్న వస్తుసంపదనంతటినీ కలబోసుకోవాల్న అభిలాషను వ్యక్తం చేశారు. ఆనాడు రష్యలోని ప్రైవేటు ఆస్తినేకదూ, దాన్ని మించిన దాన్నికూడ పునః పంపిణీ చేస్తే, ప్రజల సంపద పెరగదు సరికదా, వారు మరింత బీదలై పోగలరని ఆ నాయకులకు, గాని ప్రజలకుగాని తెలీదు.

తమ ఆస్తిపాస్తులను యితరులతో పంచుకోవాలని నిర్ణయింప బడినవారు, అలాంటి అభిలాషను వ్యక్తం చేశారా? లేదని వేరే చెప్పనవసరం లేదు కాబట్టి, వాళ్ళేం చేయవలసి ఉండింది? సోషలిజం కాలూకు అందమైన ఆదర్శాలనుండి వెనుకడుగు వేయడమా?

ఆర్థిక సమస్యలకు సంబంధించిన విషయాల్లో ఏదియేమైనా సరే వెనుక్కి తగ్గే వ్యక్తి యేమాత్రంకాదు స్టాలిన్.

ఏ విధమైన పౌర ఆస్తి అయినా సరే, వెనువెంటనే ప్రైవేటు ఆస్తికన్నా ఉత్పాదకతను పెంచుతుందన్న ఆయన అభిప్రాయం సరికాదని ఆచరణలో తేలింది. దీనికి ప్రధాన కారణమేమంటే ఆయన పౌర ఆస్తిగా పరిగణించినది పేరులో మాత్రమే, చట్టాల దృష్ట్యా మాత్రమే పౌర ఆస్తి. రైతులు తమ ధాన్యమంతటినీ ఇచ్చి వేసి, తమ జీవనానికి కొద్దిపాటి ఖండ్రికలలో నడుములు విరిగేలా పని చేయవలసి వచ్చినపుడు ఖోల్ఖోజుల్లో పౌర ఆస్తిని గురించి ఎవరైనా మాట్లాడగలరా?

ఒక్క కలం పోటుతో ప్రభుత్వం అమలు జరిపే సామాజికీకరణ వల్ల పౌర ఆస్తి అవతరించ జాలదని గత కాల అనుభవం రుజువు చేసింది. ఆధునిక సాంకేతిక పద్ధతులను వినియోగించటం, వాస్తవాల ప్రాతిపదికపై ధరలు నిర్ణయించే విధానాలు అమలు జరపటం, ప్రజాతంత్రసూత్రాలు సహజంగా ఆవిష్కృతం

## మార్కెటిజమూ, ప్రయివేటు ఆస్తి

కావడం, మొదలైన వన్నీ ఉన్నప్పుడే పౌర ఆస్తి రూపు గొంటుంది.

ఏతావాతా స్టాలిన్ వల్ల, సామాజికీకరణ అప్రతిష్ట పాలైంది; ఫలితంగా సోషలిజం గురించిన బోధ ఈ శతాబ్ది ప్రారంభంలో ఉన్న స్థానం నుంచీ వెనుకకు నెట్టబడింది.

ప్రైవేటు ఆస్తి, పెట్టుబడిదారీవిధానం "మనం మునుపు అనుకున్న దాని కన్నా బలమైనవ"ని అంగీకరించక తప్పదంటూ పార్టీ కేంద్రకమిటీ కార్యదర్శి అనతోలి దోబ్రినిన్, ప్రాగ్‌లో ఒక సమావేశంలో మాట్లాడుతూ అన్నారు. కేంద్ర కమిటీ మరో కార్యదర్శి వదీం మెద్వెదేవ్ కూడా "కమ్యూనిస్టు" పత్రికలో రాసిన ఒక వ్యాస తాత్పర్యం కూడా అదే. "పెట్టుబడిదారీ వ్యవస్థ కొత్త పరిస్థితులకు అనుగుణంగా సర్దుకుంది. సోషలిస్టు వ్యవస్థ అవతరించినప్పటికీ, సామ్రాజ్యవాద వలన వ్యవస్థ పతనమైనప్పటికీ.... అది బతికే ఉంది. పెట్టుబడిదారీ విధానం శాస్త్ర, సాంకేతిక విప్లవాన్ని కొనసాగించడానికి తగినన్ని వనరులను సంపాదించుకుంది. వర్గ పోరాటాన్ని మందగింప జేయడానికి, సామాజిక ఎత్తుగడల పరిధిని విస్తృతం చేయడానికి ఆర్థికాభివృద్ధిని ఉపయోగించుకుంది." అని ఆయన రాశారు.

వేరు మాటల్లో చెప్పాలంటే ప్రైవేటు ఆస్తిని పాతిపెట్టేందుకు ఇంకా సమయం రాలేదు. అభివృద్ధికి ఇంకా వినియుక్తం కాని వనరులు దానికున్నాయి. కాబట్టి, దాన్ని పరిగణనకు తీసుకొని, సోషలిజం మేలుకోసం దానితో మనం సహజీవనం చేయక తప్పదు

(నోవీమిర్ పత్రిక నుంచి)

(ఇంకా ఉంది)

## సమాజమూ, రాజ్యము

(15 వ పేజీ తరువాయి)

మన్న అభిప్రాయాన్ని సోవియట్ ప్రజలు విసర్జించాలి. సమర్థమైన ప్రజాస్వామిక అధికార వ్యవస్థీకరణ యావన్మందినీ యాంత్రికంగా అందులో పాల్గొనేలా చేయడం ద్వారా సాధ్యంకాదనీ, ప్రాతినిధ్య అధికార వ్యవస్థను రూపొందించి. శాసన నిర్మాణ విధులను, కార్యనిర్వాహక విధులనూ వేరుచెయడం ద్వారా మాత్రమే అది సాధ్యమనీ సోవియట్ ప్రజలు కమక్రమంగా తెలుసు కుంటున్నారు.

రాజ్యనిర్వహణలో యావన్మంది పౌరులు పాల్గొనడం అవసరమన్న మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాల్లోని భావానికి అంటిపెట్టుకొంటూనే సోవియట్ ప్రజలు, రాజ్య నిర్మాణ రంగం విషయంలో మానవాళి అభివృద్ధి పర్చిన ప్రధాన మార్గాన్ని తామూ అనుసరించాలను కొంటున్నారు. 19 వ పార్టీ సమావేశ నిర్ణయాలు ఇందుకు సాక్ష్యం. కొన్ని వస్తుగత కారణాలవల్ల, సోవియట్ రాజకీయవ్యవస్థను నిర్మించే తొలిదశలో విప్లవావేశంతో విసర్జించిన గత అనుభవంపై మళ్ళీ ఆధారపడాలని వారి కోరిక. అయితే ఇందుకు వారుచాలా కృషి చేయవలసి ఉంటుంది. నాగరిక సమాజాన్ని నిర్మించ కుండా, రాజ్యాన్ని దానికిలోను చేయకుండా, ప్రజల సృజనాత్మక శక్తికి అవకాశమివ్వాలన్న పెరిస్త్రొయికా లక్ష్యాన్ని సాధించలేము. ప్రతి వ్యక్తి యొక్క సృజనశీల శక్తి ఆచరణలోకి రావాలి. స్వేచ్ఛాయుత నాగరిక సమాజం ప్రజాతంత్ర రాజకీయ వ్యవస్థకు కేంద్రకమైనట్లుగానే స్వేచ్ఛగల వ్యక్తే నాగరిక సమాజ కేంద్రకం.

మానవ విలువలు

# 20 వ శతాబ్దంలో మానవుని వ్యక్తిత్వమూ, గమ్యము



# 20 వ శతాబ్దంలో మానవుని వ్యక్తిత్వమూ, గమ్యము

వేయి సంవత్సరాల సాంస్కృతిక చరిత్రలో మానవుని వ్యక్తిత్వమూ, గమ్యాలను గురించి అలెక్సీ ఫ్యోదరోవిచ్ లోసెవ్ (1893-1988) లోతుగా ఆలోచించారు. తన జీవిత ఉదాహరణే ఆ సమస్యను మన ముందుంచుతుందన్న విషయం ఆయనకు తెలీదు. మానవుడు ఎన్నడూ పరిష్కరింపబడని శాశ్వత సమస్య అని ఆయనే పలుమార్లు చెప్పారు, రాశారు కూడా.... "అయితే, అది యెందుకు శాశ్వతంగా పరిష్కరింపబడాలి? మానవాళి ఏ సమస్యను గురించీ ఇక ఎన్నడూ పాటుబడకుండా ఉండాలా? ఈ సమస్య గురించిన సరియైన వివరణే దాని పరిష్కారానికి నాంది అవుతోంది!" ఆయన అనేక శాస్త్రాలపై పట్టు సంపాదించాడు; పాఠశాలలో చదువుకునే రోజుల నుండీనే అప్రమత్తమైన మేధస్సుకు విలువనిచ్చారు:

ఆయన నొవొచెర్కాస్క్‌లోని ఒక మంచి ఉన్నత పాఠశాలలో చదివారు. అది గ్రీకు, లాటిన్ భాషలు, గణిత, ఖగోళ శాస్త్రాలు, కవిత్వమూ, నాటకాలు, సంగీతం — ఇన్నింటిని బోధించే పాఠశాల. అప్రమత్తమైన మేధస్సు యితర వాటన్నిటికన్నా అందమైనదనీ,.... అది శక్తి, సంతోషాలతో నిండి ఉంటుందనీ, అది పగటికలలు కనకుండా చేసి, యెప్పుడూ కార్యాచరణను ప్రేరేపిస్తుందనీ ఆయన తన 90 ఏట దేశ యువతకు చెప్పారు. అప్రమత్తమైన మేధస్సు జ్ఞానార్జనకైపాటుపడాలి. అయితే, జ్ఞానమే వరంకాదు. "కేవలం జ్ఞానంమాత్రమే ఉన్నవాడు ప్రమాదకరమైన వ్యక్తి, న్యాయాన్యాయ వివేచన లేని వ్యక్తి అవుతాడు." అని లోసెవ్ రాశారు. జ్ఞానం అనేది యాంత్రికంగా వాస్తవాలను సేకరించేది కాదు. జ్ఞానమంటే ప్రేమ అన్నది ఆయన సూత్రీకరణ.

70 ఏళ్లపాటు ఆయన విద్వద్గ్రంథాలు రాయడమేగాదు, యువతరాన్ని వాటి సహాయంతో పెంచి పెద్దచేశారు. ఆయన దాదాపు 500 పుస్తకాలు రాశారు. ఇవన్నీ 1953 తర్వాతనే ప్రచురణకు నోచుకున్నాయి.

ప్రాచీనుల వీరత్వం ఆయన మనసును ఆకట్టుకొంది. తాముచనిపోవడం తథ్యమని తెలిసికూడా తాము నమ్మినదాని కోసం రణరంగంలోకి దూకిన శూరులువారు. 1920 లలో 8 సంపుటాలలో తన తత్వశాస్త్ర గ్రంధాన్ని ప్రచురించినప్పుడు, లోసెవ్ పరిస్థితి కూడా అదే. 1930 లో ఆయనను అరెస్టుచేసి 18 నెలలు జైల్లో ఉంచారు. 1931 లో ఆయనకు నిర్బంధ శ్రమ శిబిరాల్లో 10 ఏళ్ళు పని చేయవలసిందిగా శిక్షపడింది. ఈ గడువుకు ముందే 1933 లో ఆయన విడుదలైన నాటికి ఆయన దాదాపు అంధుడై పోయాడు. 1941 లో ఆయన ఇంటిపై ఒక బాంబుపడి ఆయనకుటుంబ సభ్యులందర్నీ పొట్టబెట్టుకుంది. ఆయన పుస్తకాలూ, వ్రాత ప్రతులూ ధ్వంసమయ్యాయి.

ఆయన రచనలు ప్రచురణ కాలేదు. 23 ఏళ్ళ పాటు ఆయన మౌనంగా ఉండ పోవాల్సి వచ్చింది. కానీ, ఆయన పని చేయడం మానలేదు. ప్రభుత్వం అచ్చుమైన తత్వశాస్త్ర రచనలను నిషేధించిందే కాని, రసాభిజ్ఞతా శాస్త్ర రచనలను నిషేధించలేదు. అందువల్ల లోసెవ్ తన రచనలను ప్రచురించ వీలైన రసాభిజ్ఞతా శాస్త్ర రచనలను మొదలు పెట్టారు. 1953 లో వీటిప్రచురణ జరిగింది. ఆయన హెూమర్ పురాణాలు, సంగీతం, పునర్వికాసయుగం మొదలైన విషయాలకు సంబంధించి కళాత్మక సమస్యలపై ఎన్నో రచనలు చేశారు. "పురాతన రసాభిజ్ఞతా శాస్త్ర చరిత్ర" అనే ఆయన బృహద్గ్రంథానికి 1986 లో ప్రభుత్వ బహుమతిని ఇచ్చారు. ఈ గ్రంథం 7 వ సంపుటి ఆయన చనిపోయిన తర్వాత ఒక నెలకు వెలువడింది. తాను "చరిత్ర అఖాతం" లోకి దిగబడి పోతున్నానని తెలిసి కూడా లోసెవ్ ఈ గ్రంథం 8 వ సంపుటిని (టైపు చేసిన దాదాపు 2 వేల పుటలు) కూడా పూర్తి చేశారు.

# 20వ శతాబ్దంలో మానవుని వ్యక్తిత్వమూ, గమ్యమూ

## మేధాశక్తి గురించి

## అలెగ్జీ లోసెవ్

1. మేధాశక్తి అంటే ఏమిటి. అది పరిజ్ఞాన సంచయం కాదు ఏదైనా వృత్తిలో నిష్ణాతుడు కావడమూ కాదు. సాంస్కృతిక ప్రగతిలో పాల్గొనడమూ కాదు. కేవలం నైతిక ప్రవర్తన, లేదా అరితేరిన కళాకారుడు కావడం కూడా కాదు. ఈ లక్షణాలన్నీ మేధాశక్తి వ్యక్తీకరణేకాని, అసలు మేధాశక్తి కాదు. లేదా, అవి మేధాశక్తికి సంబంధించి తటస్థంగా, విరోధంగా కూడా ఉండవచ్చు.

**2.** మేధాశక్తి, వ్యక్తిత్వం. మేధాశక్తి వ్యక్తి జీవిత రూపాల్లో ఒకటి. స్థూలంగా చెప్పాలంటే, అది వ్యక్తిత్వ ప్రక్రియ.. మరి వ్యక్తిత్వ మంటే ఏమిటి? అది సహజ, సామాజిక, చారిత్రక సంబంధాల రూపం. అయితే, మేధాశక్తికి అర్థం అదొక్కటే కాదు. ఏ మాత్రమూ మేధాశక్తి లేని మనిషి సైతం ఏదో కొంత వ్యక్తిత్వం కలవాడే.

**3.** మేధాశక్తి, భావజాలం. మేధాశక్తి అనేది భావజాలం సందర్భంగా మాత్రమే రూపుగొన్న వ్యక్తిత్వ ప్రక్రియే. కాని, మేధాశక్తిని వర్ణించేందుకు ఈ మాటవాడటం అరుదు. మేధాశక్తిగల మనిషి తెలివితేటలు గలవాడనీ, బాగా చదువుకున్న వాడనీ, దయాళువనీ, విశాల హృదయుడనీ, యింకా ఇలాంటి సుగుణాలు అనేకం గలవాడనీ అంటుంటారు. అటువంటి వర్ణన సరియైనదేగాని, ఆగుణాలు ముఖ్యమైనవి కావు. వీటిలో ప్రతి ఒక్కటి ఒక ప్రత్యేక లక్షణాన్ని తెలుపుతుందే తప్ప, అవసరమైన సామాన్యీకరణ అందులో లేదు. ఈ సామాన్యీకరణ భావజాలానికి సంబంధించినది. ఏదో ఒక విధమైన భావజాలం ప్రతి ఒక్కరికీ, మేధావులు కాని వారికి సైతం ఉండక తప్పదు. సహేతుకంగా ఆలోచించలేని అల్పిష్టికి చైతన్యయుతమైన భావజాలముండదు. కానీ మనం అతని భావజాలమేమిటో చెప్పవచ్చు.

మేధాశక్తి లక్షణాలనన్నిటినీ సమాహరించడం ద్వారా మనమిలా చెప్పవచ్చు: సమస్త మానవాళి సౌభాగ్యానికి కృషి చేసే మనిషి మేధాశక్తి గల వ్యక్తి. సార్వ ??నిక సౌభాగ్యం నెలకొన్న భవిష్యత్తులో మనుషులు ఎలా జీవిస్తారో, ఎలా పనిచేస్తారో నేడు నిజమైన మేధావి అలా జీవిస్తాడు, పని చేస్తాడు. అంతే కాదు. మేధావికి మేధాశక్తిని గురించిన సవివరమైన ఎరుక ఉండ నవసరం లేదు. పైపెచ్చు, అటువంటి ఎరుక ఒక జీవితక్రమంగా మేధాశక్తికి అడ్డుపడవచ్చు కూడా. తన మేధాశక్తిని ఇతర్ల ముందు ప్రదర్శించడం నిజమైన మేధావి లక్షణం కాదు. తనమేధాశక్తిని గురించి అతడు ఆలోచించడు. అది అతని ఊపిరి. మేధాశక్తికి సంబంధించిన భావజాలం సమస్త మానవాళి సౌభాగ్యం కోసం పనిచేసినా తాసిలా చేస్తున్న ఎరుక దానికి బొత్తిగా ఉండదు. నిజమైన మేధాశక్తి యొక్క నిజమైన భావ జాలం స్వాభావికమైనది.

**4.** మేధాశక్తి, వాస్తవికతకు సరికొత్త రూపమివ్వడం సామాజిక, వైయక్తిక, సహజసిద్ధ దోషాలతో పాటు మేధాశక్తి తాలూకు సంస్కారం అతిసాధారణ రూపంలో ఉంటుంది. వాస్తవాన్ని గురించి కేవలం తర్కవితర్కాలు చేయడమేగాక దానికి నిరంతరం కొత్తరూపమివ్వడం, పట్టుదలతో కృషి చేయడలోనే దీని ప్రాముఖ్యం ఉంది. మేధాశక్తి యొక్క సంస్కారం జీవితంలోని దోషాలను గురించి కేవలం తర్కవితర్కాలు చేస్తూ మీనమేషాలను యెంచుతూండజాలదు. వాటిని తొలగించడానికి కృషిచేస్తుంది కూడ. అసలు "సంస్కారం" అన్న పదంలోనే వాస్తవికతకు సరికొత్త రూపమివ్వడమనే సూచనవుంది.

**5.** మేధాశక్తి సంస్కారం సంస్కారం కేవలం స్వతసిద్ధమైనది కాదు. మానవ అంతశ్శక్తి తన్ను తాను మెరుగుపర్చుకోవడానికి, పరిసర ప్రపంచాన్ని సరిదిద్దడానికి ఉద్దేశపూర్వకంగా అదిచేసే కృషే సంస్కారం. ఈ విషయంలో మేధాశక్తి ఇక స్వాభావికమైనది కాదు. దాని పునాది

## 20వ శతాబ్దంలో మానవుని వ్యక్తిత్వము, గమ్యము

మాత్రమే స్వాభావికమైనది. కాని, అది వాస్తవ జీవిత ప్రక్రియలలో అవసరమైనచోటల్లా సాహసోపే తమైనది, దీక్షాయుతమైనది. మానవుని చుట్టూ సహజ, సామాజిక, చారిత్రక పరిస్థితులు అల్లకల్లోలంగా ఉంటాయి. ఇవి వ్యక్తిత్వానికి తరచు అనుకూలంగా ఉన్నప్పటికీ, అంతకన్నా తరచుగా అతనికి వ్యతిరేకంగా తిరగడం కద్దు. అందువల్ల, అన్నిరూపాల సహజ, సామాజిక, చారిత్రక దోషాలనుంచీ తన్నుతాను రక్షించుకొనే మార్గాలున్న చోట్లలో మాత్రమే మేధాశక్తి ఉంటుంది. ఇందుకు సుదీర్ఘ సన్నాహాలు ముఖ్యం. ఇందుకు, భావజాలరంగంలో అర్థవంతమైన కృషిచే యవలసి ఉంటుంది. మేధావిగా ఉండాలంటే నిరంతరం కృషిచేయాలి. మేధావి ఆత్మరక్షణ చేసుకోవడమేకాదు, పోరాటానికి సిద్ధపడి ఉండాలి. అందుకుగాను భిన్న సామాజిక, ఆర్థిక పరిస్థితులనుబట్టి తన్నుతాను తీర్చి దిద్దుకోవాలి. అలా చేయాలంటే వాస్తవాల పట్ల విమర్శనాత్మక దృక్పథం అవసరం. కాబట్టి, విమర్శనాత్మక మనస్తత్వం కలిగి, సామాజి కంగా క్రియాశీలురైన వారిలో మాత్రమే మేధాశక్తి స్వతస్సిద్ధంగా ఉంటుంది. ఎప్పుడు పోరాడాలో, ఎప్పుడు కూడదో మేధావి తన భావజాల ప్రాతిపదికను బట్టీ, సామాజిక, చారిత్రక పరిస్థితిని గురించిన తన అవగాహ నను బట్టీ నిర్ణయించుకొంటాడు. మేధాశక్తి తాలూకు సాంస్కృతిక కృషి ఆశయం యిదే. కృషి అతనికి బాధాకరమైన అవశ్యకతకాదు; నిరంతర ఆనందదాయకం. మేధావికి అతని వనే నిత్యయవ్వనాన్ని సమకూర్చుతుంది. అది విశ్వజ నీన సుఖసంతోషాలకై ఆనందంతో చేసే సేవ.

6. మేధాశక్తి, సామాజిక, వ్యక్తిగత, చారిత్రక సాహసకృత్యమూ. చరిత్రలో సంపూర్ణ శాంతికా లాలు లేనేలేవని అంటాను. ఇది చరిత్రకన్నా మానవాభివృద్ధి మొత్తం పరిణామానికి అన్వ యిస్తుంది. అతి సామాన్యమైన జీవితవిధా నంలో, అత్యంత శాంతియుతమైనదిగా కనిపించే దైనందిన కార్యకలాపాలలో మనసుకు ఆందోళన కలిగించేవి, ప్రమాదక రమైనవి, నష్టకరమైనవి కోకొల్లలుగా ఉంటాయి. అవన్నీ దేనికైనా దారి తీయవచ్చు. కాబట్టి, నిజమైన మేధావి బృందం బాహాటంగా పోరాటానికి సదా సన్నద్ధంగా ఉంటుంది. జీవితంలో దాగివున్న అన్ని రూపాల దోషాలకూ వ్యతిరేకంగా పోరాడవలసి ఉన్నందువల్ల కూడా ఈ సన్నద్ధత అవసరం. అంటే, నిజమైన మేధాశక్తి ఎల్లప్పుడూ ఒక సాహస కృత్యం. అంటే, అహంకార అస్తిత్వానికి సంబంధించిన జీవిత నిత్యావసరాలను మరచిపోవడానికి సిద్ధంగా ఉండటమన్నమాట. మేధాశక్తి సారాంశాన్ని వ్యక్తం చేయటానికి "సాహసకృత్యం" అనే పదంకన్నా మరో సరియైన మరోమాట లేదు. మేధాశక్తి అంటే అనుక్షణం, అనునిత్యం ఒక సాహసకృత్యానికి తయారుగా ఉండటమన్నమాట.

---

## లోసెవ్ తన భార్య లోసెవాకు జైలునుండి రాసిన లేఖలు

1932, జనవరి 27

స్విర్‌లాగ్ - బోరోవ్‌ల్యాంకా (జైలు).

ప్రస్తుతానికి నేను సంఖ్యా తత్వశాస్త్రాన్ని గురించి ఆలోచిస్తూ ఆరుబయట అటూఇటూ నడుస్తున్నాను. నక్షత్రాలు మినుకుమినుకు మంటున్న ఆకాశాన్ని గంటల తరబడిచూసే అవకాశం లభించింది. నీవు పాఠశా లలో చదువుకునే రోజుల్లో చేసిన పరిశీలనల పుస్తకాన్ని ప్పుడు నేను ఉపయోగించు కోలేకపోతున్నందుకు నాకు చింతగా ఉంది. "నక్షత్ర సమేత ఆకాశం, దానిలోని అద్భుతాలు" అనే పుస్తకం నీతో కలసి రాయాలని వుంది. నాకు బతకాలని ఉంది. నాకు సంగీత సాహి త్యాలు కావాలి. కాంప్లెక్స్ వేరియబుల్ సిద్ధాంతాన్ని అధ్యయనం చేస్తున్నాను.

1932, ఫిబ్రవరి 19
స్విర్‌లాగ్ - బోరోవ్‌ల్యాంకా

నిండుయవ్వనంలో నూతన సృజనాత్మక కృషి ప్రాంగణంలో మనల్ని దారుణంగా అణచివేశారు. ఏది ఏమైనా, దేవునిపై తిరుగుబాటు జరపడం. అర్థరహితమనీ, నహేతుకం కాదని అనిపిస్తున్నా నా హృదయంలో, ప్రభుత్వాధినేతలపై రగులుతున్న కోపాగ్నులను నీనుంచి దాచేను. నేనెవర్ని? ఒక ప్రొఫెసర్‌ను. కాదా? సోవియట్లు తిరస్కరించిన ఒక సోవియట్ ప్రొఫెసర్‌ను కానా? ఒక శాస్త్రజ్ఞుణ్ణి కానా? ఖైదీనా? ఒక రష్యన్ ప్రొఫెసర్‌ను నేరస్తునిగా పరిగణించే హక్కు ఏ దుర్మార్గుడికి ఉంది! నేనెవర్నీ నేనేమిటీ? ఇంతకన్న భయంకరమైన ప్రశ్న: పదేళ్ళలో, అంతదాకా ఎందుకు, ఐదేళ్ళలో, మూడేళ్ళలో, అంతదాకా ఎందుకు, ఒక సంవత్సరకాలంలో నేనేమైపోతాను? నాకు కలుగుతున్న అనేక ఆలోచనల వ్యక్తీకరణకుగల ప్రతిబంధకాలు నేను ఆత్మనిగ్రహాన్ని కోల్పోయేలా చేస్తున్నాయి.

1932, మార్చి 11.
స్విర్‌లాగ్ - బోరోవ్‌ల్యాంకా

అనేక సంవత్సరాలుగా నా రచనలు తీవ్రంగా "సెన్సార్"వుతున్నందువల్ల మామూలు విషయాలు కూడా రాయలేకపోతున్నాను. అవి సెన్సారయిన తర్వాత వాటిలో నేను దొంగచాటుగా కొన్ని

## 20వ శతాబ్దంలో మానవుని వ్యక్తిత్వమూ, గమ్యము

నిషిద్ధ విషయాలను మధ్య మధ్య జొప్పించడానికి అదీ కారణం. ఇది ప్రమాదకరమని నాకు తెలుసు. కాని, తాను చెప్పదలచుకున్నది కాగితంపై పెట్టాలనుకునే తాత్వికుడు తన భద్రతను గురించిన భయాందోళనలకు అతీతుడు. నేను ఒక తాత్వికుడుగా అప్రయత్నంగా ఎదిగిన కాలమది. సోవియట్ సెన్సార్ షిప్ విధించిన కఠోరపరిమితులకు లోబడి రాయటం నాకు కష్టమైపోయింది. వివిధ దృక్పథాలకు చెందిన నా శత్రువులపై నా రచనల్లోని అనేక దాడులకు అదీ కారణం. తమ భావాలను వ్యక్తం చేయటానికి రచయితలకు అవకాశం ఉన్న మామూలు సామాజిక పరిస్థితుల్లోనైతే, నేను పత్రికల్లో కాని, నా ఉపన్యాసాల్లో కాని అవలంబించిన తీవ్రమైన, పరుషమైన వాద, ప్రతివాద ధోరణి ఉండేదికాదు. ఇది నీవర్థం చేసుకొంటావనుకుంటాను.

1932, జూన్ 30.
స్విర్‌లాగ్ మెద్వెజ్యా గోరా (బెల్‌బాల్ట్‌లాగ్)

1930-1932 సంవత్సరాల్లో కొన్ని ఘటనలు జరిగినప్పటికీ, మనది సరియైన మార్గమనీ, మనం అనుసరిస్తున్న లక్ష్యం సరియైనదనీ నేను అనుకుంటున్నాను. ప్రపంచ వ్యాప్త మత, విజ్ఞానశాస్త్ర, కళ, సమాజ సమస్యల మధ్య ఉన్న మనం, 20వ శతాబ్ద ప్రజలం, నిర్మూలించసాధ్యం కాని మన సొంత జీవన సరళిని సమకూర్చాము. దీనికి కారణం మనం ప్రౌఢ దశలో ఉండటమే గాక, మానవ సంస్కృతి యొక్క విశ్వజనీన, చారిత్రక అనుభవాన్ని మనే హృదయాల్లో నిలుపుకోవాలనీ, పాత, కొత్తలలోని మంచివాటికి దూరం కాకూడదనీ, అభిలషిస్తున్న 20వ శతాబ్ద ప్రజల తాలూకు సత్యాన్ని యిది ప్రతిబింబిస్తుండటం కూడా. చారిత్రక పరిస్థితులవల్ల సత్యంయొక్క రూపం మారినా, దాన్ని మనం అర్థంచేసుకోవడం కష్టమైనా, ఎప్పుడూ సత్యం ఒక్కటే. మన సమకాలీనుల్లో (రష్యన్లూ పాశ్చాత్యులూ) ఒక్కరూ అర్థం చేసుకోలేకపోయినా మనమీ సత్యాన్ని పసికట్టామనీ, సరియైన జీవితవిధానాన్ని రూపొందించామనీ నాకు అనిపిస్తోంది. మనం బాధలు పడ్డామంటే దానికి కారణం మనమనుసరించిన జీవిత విధానం సరియైనది కాకపోవడం కాదు, దాన్ని సరిగా అనుసరించలేకపోవడం. గత రెండు సంవత్సరాల. అనర్థాలకు అదొక్కటే సరియైన కారణం.



# వర్ధమాన దేశాలూ, సోషలిజమూ, పెట్టుబడిదారీ విధానమూ

### వెనుకబడిన సమాజమూ, సోషలిజమూ

వలస వ్యవస్థ విచ్ఛిన్నమైన 1960లు, సోవియట్‌యూనియన్‌కు గొప్ప ఆశాజనకమైన సంవత్సరాలుగా ప్రారంభమయ్యాయి. ఇప్పుడు కొందరు యేమైనా చెప్పనివ్వండి అప్పుడు చాలామంది కృశ్చేవ్ మాటలను నమ్మారు. యిరవై సంవత్సరాల్లోనే అమెరికాను సోవియట్‌యూనియన్ తలసరి ఉత్పత్తిలో అధిగమిస్తుందని ఆయన నొక్కి చెప్పాడు. దీన్ని అర్థం చేసుకోవచ్చు. యెందుకంటే అప్పుడు దేశ ఆర్థిక ప్రగతి అత్యధికులను ఆశావాదులుగా చేసింది; "ఉజ్వల భవిష్యత్తు"ను సమీపించేందుకు తపన పడేట్టు చేసింది.

ఒక వ్యవస్థగా పెట్టుబడిదారీ విధానం, దాదాపు తన శక్తిసామర్థ్యాలన్నిటినీ వినియోగించుకున్నదని అప్పుడు చాలామంది అనుకున్నారు. తరుణ దేశాలకు, యితర అన్ని వర్ధమానదేశాలకు తమ ఆర్థిక వెనుకబాటుతనాన్ని నిర్మూలించుకోడానికీ, ఒక తరం కాలంలోనే తమ తీవ్ర సామాజిక సమస్యలను త్వరితంగా పరిష్కరించుకోడానికీ వాస్తవికమైన భవిష్యదవకాశాలను సమకూర్చగల శక్తి సోషలిజానికి మాత్రమే వుందని కూడా చాలామంది అనుకున్నారు.

1960లలో అనేక నవస్వతంత్ర దేశాలు సోషలిజాన్ని యెంచుకున్నాయి. అవి పెట్టుబడిదారీ విధానాన్ని తిరస్కరించాయి. యెందుకంటే అవి పెట్టుబడిదారీ విధానంలో వలసవాదాన్ని చూశాయి. సామాజిక న్యాయం, సమిష్టీకరణ, మానవీయత గురించిన సాంప్రదాయక భావాలను వ్యతిరేకించే అమానుష వ్యవస్థగా దాన్ని పరిగణించాయి. వెనుకబడిన దేశాల్లో ఆర్థికాభివృద్ధిని త్వరితపర్చే శక్తి పెట్టుబడిదారీ విధానానికి లేదని అభిప్రాయపడి కూడా దాన్ని తిరస్కరించాయి.

అదే సమయంలో సామాజికాభివృద్ధిలోని అనేక రంగాల్లో బ్రహ్మాండమైన ప్రగతిని సాధించిన సోవియట్‌యూనియన్ కట్టెదుటే కనిపించింది. కొన్ని దశాబ్దాల్లోనే రష్యా స్పష్ట

మైన ఫలితాలను సాధించగలిగినప్పుడు ఉష్ణ మండలంలోని ఆఫ్రికాదేశాలు సాధించలేవా? రష్యాలోవున్న గొప్ప శాస్త్రవేత్తలను, పెద్దపెద్ద పారిశ్రామిక కేంద్రాలను, అపార ఖనిజ నిక్షేపాలను, మానవ బలగాలను ఆ దేశాలు అప్పుడు పరిగణనకు తీసుకోలేదు.

నవస్వతంత్రరాజ్యాల్లోని చాలామంది నాయకులను అసలు సోషలిజంకన్నా(దీని అర్థం వారికి స్పష్టంగా తెలియదు) అప్పుడు రూపు గొన్న దాని లక్షణాలు బాగా ఆ కర్షించాయి: కింది నుండి పైవరకూ బాగా అభివృద్ధిచెందిన బ్యూరాక్రటిక్ నిర్మాణంగల అత్యంత కేంద్రీకృతమైన రాజ్యం; సామాజిక జీవనంలోని అన్ని రంగాలకు ఒకే ఒక పార్టీ ప్రభావ విస్తరణ; ఒకే అధికార సిద్ధాంతం వగైరా. ఆర్థిక, సాంస్కృతిక వెనుకబాటుతనాన్ని సాధ్యమైనంత త్వరలో అధిగమించడానికీ, క్లిష్టమైన నరవర్గ, మత సమస్యలను పరిష్కరించడానికీ సమస్త శక్తులను, సాధనాలను సమీకరించేందుకు తప్పనిసరైన షరతులు యివేనని వారు గట్టిగా నమ్మారు.

పాశ్చాత్య ప్రజాస్వామ్యాన్ని, బూర్జువా పార్లమెంటరీవిధానాన్ని నవస్వతంత్ర రాజ్యాలు తోసిపుచ్చేట్టు చేసింది ఆ వైఖరే. పార్లమెంటరీ వ్యవస్థను (బాగా అభివృద్ధి చెందిన దేశాల దీర్ఘకాలిక కృషివల్ల యిది ఉనికిలోకి వచ్చింది) తొలగించడానికి మరో ప్రత్యామ్నాయాన్ని గురించి నవస్వతంత్రదేశాల్లో అధికారంలోకి వచ్చిన నాయకులు ఆలోచించలేదు. యెలాంటి ప్రజాస్వామ్య రూపంగల ప్రభుత్వమైనాసరే — దాని సామాజిక, వర్గసారం యేమైనవప్పటికీ — నిరంకుశత్వాన్ని, తరచు ఏకాధిపత్యపాలనను స్థాపించకుండా ఆ నాయకులను నిరోధించింది. "బూటకపు పాశ్చాత్య ప్రజాస్వామ్యానికి" వ్యతిరేకంగా పోరాటాన్ని ప్రారంభించిన యీ నాయకులు సోషలిస్టు నినాదాల ముసుగులో తరచు కమ్యూనిస్టులను అంతమొందించారు.

మాజీ వలసదేశాలు అనేకం పెట్టుబడిదారీ విధానాన్ని తిరస్కరించడం యాదృచ్ఛికమేమీ కాదు. పెట్టుబడిదారీవిధాన అపరిపక్వరూపాలు తెచ్చిపెట్టిన యిబ్బందులకు పశ్చిమ యూరప్ ప్రజలు ప్రతిస్పందించిన తీరు యిది: మూర్ఖపు విధ్వంసన (ఉదాహరణకు లుడ్డియిటులు); ఊహాజనిత సోషలిజం, కమ్యూనిజం భావాల పెరుగుదల; భూమ్మీద స్వర్గాన్ని నిర్మించే విచిత్ర ప్రాజెక్టులు. యిలాంటి అభిప్రాయాలను రష్యాలో నరోద్నిక్కులు, కొన్ని సామాజిక ఉద్యమాలూ వ్యక్తం చేశాయి. బూర్జువా నాగరికత సాధించిన విజయాలను వినియోగించుకోవడం ద్వారాకాక, పెట్టుబడిదారీ విధానాన్ని దాటవేయడంద్వారా సోషలిజాన్ని నిర్మించవచ్చునని వీరు నమ్మారు.

సోషలిజం కొన్ని శతాబ్దాలవరకూ ఊహాజనితంగానే వుంది. కారణం ప్రసిద్ధ చింతనాపరులు లేకపోవడంవల్లకాదు, దానికి ఆర్థిక, సామాజిక పూర్వాపేక్షితాలు లేనందువల్ల. పారిశ్రామిక విప్లవం తర్వాత మాత్రమే, పశ్చిమయూరప్‌లో, ముఖ్యంగా బ్రిటన్‌లో పారిశ్రామిక కార్మిక వర్గం రూపొందిన తర్వాతనే యింగ్లీషు రాజకీయ అర్థశాస్త్రం, జర్మన్ తత్వశాస్త్రం, ఫ్రెంచి ఊహాజనిత సోషలిజంల ఆధారంగా తమ శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు అభివృద్ధి చేశారు.

పెట్టుబడిదారీ అభివృద్ధి తొలిదశలగుండా మాత్రమే గడిచిన రష్యాలో పాదుగొల్పిన శాస్త్రీయ సోషలిజం ఆ కాలపు వాతావరణంనుండి అనైచ్ఛికంగానే కొన్ని ఊహాజనిత లక్షణాలను జీర్ణించుకున్నది. యిది నిర్దిష్టంగా యుద్ధకమ్యూనిజం విధానంలో, విప్లవం తర్వాత వెనువెంటనే పాదార్థిక విలువల పంపిణీకి సంబంధించిన కమ్యూనిస్టు సూత్రాలను అనువర్తింపజేయడానికి జరిగిన ప్రయత్నాల్లో కనిపించింది.

విప్లవకారుల తరతరాలనుండి సంక్రమిస్తూ వచ్చిన అనేక భావనలను ఆచరణలో అమలు జరపడం సాధ్యంకాదనే విషయాన్ని

లెనిన్ మేథన్సు యిట్టే గ్రహించింది. సోవియ ట్‌యూనియన్ సాపేక్షంగా త్వరలోనే యుద్ధ కమ్యూనిజం విధానాన్ని తొలగించి దాని స్థానంలో నూతన ఆర్థికవిధానాన్ని అనుస రించింది. ప్రత్యక్షంగా సోషలిజంలోకి పరివ ర్తన చెందే పరిస్థితులు లేవనే వాస్తవాన్ని గ్రహించి అలా చేసింది. ప్రపంచ విప్లవం అనే ఊహాజనిత భావనను శాంతియుత సహజీవనభావం తోసివుచ్చింది.

లెనిన్ మరణం తర్వాత సోవియట్ నాయకులు అనేక రంగాల్లో యుద్ధకమ్యూనిజా న్ని తిరిగి చెపట్టారు. సామాజిక క్రమానికి యెలాంటి ప్రత్యామ్నాయాలు, తుదకు యెలాంటి వివరణలు లేకుండానే దాన్ని ముందుగానే నిర్ణయించారు. దాని తాలూకు యేకపక్ష స్వభావం గురించిన అశా స్త్రీయమైన అభిప్రాయాలు సోవియట్ సామాజికశాస్త్రాల్లో క్రమక్రమంగా పైచెయ్యి సాధించసాగాయి. సోషలిజానికి సంబంధించిన వస్తుగత గీటురాళ్లు, దాని పూర్వాపేక్షితాలు—ఉత్పాదక శక్తులు ఒక స్థాయిలో అభివృద్ధిచెందడం, ప్రజల సంస్కృతి, రాశిలో, వాసిలో శ్రామికవర్గ అభివృద్ధి — అంతరించాయి. చరిత్ర, సామాజిక పరిణామం గురించిన మార్క్సిస్టు భౌతికవాదం స్థానంలో ఆత్మగతవాదం చోటు చేసుకుంది.

వేరుమాటల్లో చెప్పాలంటే, పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్ క్రమం ప్రారంభమయ్యేవరకూ సామాజిక ప్రగతి, సోషలిజం నిర్మాణానికి సంబంధించి సోవియట్ సైద్ధాంతికవేత్తల ఆలోచనల్లో ఊహాజనిత అంశాలు, శ్రామికవ ర్గేతర సోషలిజం భావాలు వుండినాయి. అందువల్లనే ఆర్థిక, రాజకీయ ప్రవర్తనలో, భావజాలంలో, సంస్కృతిలో ఏకరూపతను పాదుకొల్పాలనే కోరిక; విస్తృతంగా ప్రబలిన సమానీకరణతత్వం, దారిద్ర్యం త్యాగాల ఆరాధనా వ్యాప్తి; మానవమాన్యతపట్ల నిర్లక్ష్యం; ప్రజాస్వామ్యంపట్ల చిన్నచూపు; వ్యక్తులను ప్రామాణీకరించడం; పాదార్థిక; సాంస్కృతిక అవసరాలపై కనిష్ట పరిమితులు; సాంస్కృతిక వారసత్వంపట్ల అమర్యాద.

ఇవన్నీ నవస్వతంత్ర దేశాలపై ప్రత్యక్ష ప్రభావాన్ని నెరపాయి. సోషలిజంపట్ల వాటి మొగ్గుకుగల అవకాశాలను తెలుసుకోడానికి యివి అవసరం. యెంత వెనుకబడ్డ దేశంలో నైనా (మధ్యంతర దశల్లో వున్నప్పటికీ) సోషలి జాన్ని నిర్మించవచ్చునని 1960 లలో ఆ తరు వాత చాలాకాలం వరకూ గల భావన, సామాజిక క్రమాలపట్ల మొరటు వైఖరిని తెలియజేస్తోంది.

1960 లలో నవస్వతంత్రదేశాలతో సోవియట్ యూనియన్ ముమ్మర ఆర్థిక సంబంధాలను నెలకొల్పుకునే విధానాన్ని ఆమోదించి, అన్నిరకాల సహాయాన్ని ముఖ్యంగా సోషలిజాన్ని యెంచుకున్న దేశాలకు — ఈజిప్టు, ఘనా, గినియా, కొన్ని యితరదేశాలకు — అందజేయడం మొదలుపెట్టింది. ఆశ్చ ర్యకరమైన విషయమేమంటే సోషలిస్టు లక్ష్యాలను ప్రకటించి పెట్టుబడిదారీ పంథాల్లో అభివృద్ధి చెందుతూండిన భారతదేశంలాంటి దేశాలకు యీ సహాయం యెంతో సమర్థమైనదిగా రుజువైందికాగా సోషలిజంకోసం దీర్ఘలంఘ నకు ప్రయత్నించిన రాజ్యాలు ఆచరణలో సహాయంనుండి ప్రయోజనం పొందలేక పోయాయి.

ఇతర అన్ని వ్యవస్థల్లాగానే సోషలిజానికి తన సొంత దశలుంటాయి — ప్రారంభ రూపాలు, మరింత పరిపక్వమైన రూపాలు. పలురకాల సోషలిజం (ఆమాటకొస్తే పెట్టుబ డిదారీ విధానానికి కూడా వున్నాయి) నమూనా లున్నాయి. కానీ ఆదేశపూర్వకమైన, బ్యూరాక్ర టిక్ నమూనా సోషలిజానికి వ్యతిరేకమైనదిగా అంచనా కట్టడానికి మనకు సకల ఆధారాలూ వున్నాయి. ప్రారంభంనుండీనే సామాజిక తిరో గమనం దీని లక్షణం. అయితే యీ నమూ నావల్ల అందుబాటులోవున్న సమస్త వనరుల ను సమీకరించుకోవటంద్వారా, బలప్రయోగ

పద్ధతులను ముమ్మరంగా వినియోగించ డంద్వారా సాపేక్షంగా స్వల్పకాలంలో కొన్ని రంగాల్లో స్పష్టమైన ఫలితాలను సాధించ వీలున్నప్పటికీ యిది చారిత్రకంగా అశాస్త్రీయమైనది. అదే సమయంలో యీ నమూనా వల్ల యితర అనేక రంగాలు నిర్లక్ష్యానికిగురై స్తబ్ధతలో పడిపోతాయి. యీ క్రమంలో జరిగే నష్టాలను తరచు తిరిగి పూడ్చుకో వీలులేనివిగా వుంటాయి. సాధించిన విజయాలతో పోల్చితే యీ నష్టాలు అపారమైనవి.

బొరకాసుల సోషలిజానికి (స్టాలిన్ మొగ్గినది యీదిశలోనే) దారితీసే యుద్ధ కమ్యూనిజంతో లెనిన్ నూతన ఆర్థిక విధానం తిరుగులేని విధంగా తెగతెంపులు చేసుకొని, సోషలిజానికి క్రమక్రమంగా, ప్రణాళికా బద్ధమైన పరిస్థితులను కల్పించే దిశలో దేశాన్ని మళ్లించింది. బుఖారిన్, రైకోవ్‌లు ప్రతిపాదించిన సోషలిజం నమూనా కూడా స్టాలిన్ బ్యూరాక్రటిక్ నమూనాకు భిన్నమైనది. యెందుకంటే యిది దేశం సోషలిజం వైపు క్రమ క్రమంగా సాగడానికి వీలు కల్పించేదే.

"ఒక నిర్దిష్ట సామాజిక వ్యవస్థ చారిత్రక ప్రగతి దాని నైతిక అభివర్గాల వల్లనేగాక సామాజిక ఉత్పత్తిని మరింత బాగా నిర్వహించ గలిగే, అధికతర శ్రమ ఉత్పాదకతను సాధించగలిగే దాని శక్తివల్ల కూడా నిర్ధారణ అవుతుంది."

పైన తెలిపినదంతా నవస్వతంత్ర దేశాలకు వర్తిస్తుంది.

**వెనుకబడిన సమాజమూ, పెట్టుబడి దారీ విధానం.**

ఒక వెనుకబడిన సమాజం సోషలిజానికి సన్నద్ధం కాని పక్షంలో అందులో పెట్టుబడిదారీ విధానం త్వరితంగా అభివృద్ధి చెందడానికి తగిన పరిస్థితులున్నాయని మనం భావించ కూడదు. తెగల సంబంధమైన లక్షణాలు బలంగా వున్న సమాజాలు పెట్టుబడిదారీ ఆర్థిక పద్ధతులను, బూర్జువా భావాలను యేమంతగా స్వీకరించవు. యీ కారణంవల్లే అనేక పెట్టుబడిదారీ ఒరవడిగల దేశాలు విపరీతంగా రాజకీయ సంక్షోభాలకు, తరుచు కుట్రలకు గురౌవుతాయి. యేదేమైనప్పటికి అలాంటి సమాజాలు "జన్యురీత్యా" సోషలిజంకన్నా పెట్టుబడిదారీ విధానానికి దగ్గరగా వుంటాయి. యిది సామాజిక-చారిత్రక అభివృద్ధి నియమానికి అనుగుణమైనదే.

ఇప్పటికి కొనేళ్లుగా శాస్త్రవేత్తలు యీ సమస్యను చర్చిస్తున్నారు: స్వేచ్ఛాయుత పోటీగల గుత్త పెట్టుబడిదారీ పూర్వదశ, అవ్యవస్థకు చెందిన పరిపూర్ణదశా? ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం దాని తిరోగమనదశా? యిది వాస్తవానికి విరుద్ధమా, కాదా? యిది మరో విధంగా వుండియుండ వచ్చా? యీనాటి అభివృద్ధిచెందిన పెట్టు బడిదారీ విధానం ఆ వ్యవస్థకు చెందిన పరిపూర్ణ దశ అనేది మరింత దగ్గరగా వుంటుందా? యెందుకంటే యిందులో మునుపటి దశల్లో కన్నా సంక్షోభాలు తక్కువ సంభవించాయి, ఆర్థిక వ్యవస్థలో, రాజకీయాల్లో బలమైన ఏకీకరణ క్రమాలు జరిగాయి. పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాల్లో జీవన ప్రమాణాలు అసాధారణంగా పెరిగాయి. పండితులేకాక, రాజకీయవేత్తలు కూడా యీనాడు యీ అభిప్రాయాన్ని కలిగి వున్నారు, దీన్ని చర్చిస్తున్నారు.

నా పరికల్పన యిదీ: సామాజికాభివృద్ధికి అనేకరూపాలు, అనేక ప్రత్యామ్నాయాలు విలక్షణంగా వుంటాయి. పెట్టుబడిదారీ పరిణామంలోని ఒకానొకదశలో, అవి ప్రత్యేకించి సంక్షోభానికి ఆస్పదంగా వుండే దశలో సోషలిస్టు విప్లవాన్ని తీసుకు రావడం సాపేక్షంగా సులభమే, అయితే అందుకు వస్తుగత, ఆత్మగత కారకాలు కూడా వుండాలి కానీ సంక్షోభం

ముగిసిన తర్వాత పెట్టుబడిదారీ విధానం కొత్త రూపు నందుకుంటుంది, స్థిరత్వాన్ని తిరిగి పొంది చాలాకాలంపాటు నిలదొక్కు కుంటుంది. సోషలిస్టు విప్లవానికి సన్నద్ధం కావడానికి ఒకప్పుడు కీలకమైనవిగా వున్న కారకాలు (మితిమీరిన వుత్పత్తివల్ల తీవ్రమయ్యే సంక్షోభం, ఉత్పత్తిలో అరాచకం, శ్రామిక వర్గంలో నిరపేక్ష, సాపేక్ష పేదరికం, దానిసంఖ్య పెరుగుదల, దాని అత్యున్నత సంఘటితతత్వం, రాజకీయ చైతన్యం, శాస్త్రీయ సోషలిజంలో దాని నిమగ్నత వగైరాలు) నూతన పరిస్థితుల్లో పనిచేయకుండా వుంటాయి. లేదా వాటి కార్య కలాపాల తీవ్రత తగ్గుతుంది, తమ కార్యకలాపాలను మార్చు కుంటాయి. ''బూర్జువా వర్గానికి సమాధి కట్టే'' శ్రామిక వర్గం కూడా ఊహించనంతటి మార్పులకు లోనౌతుంది. శాస్త్ర సాంకేతిక విప్లవం విస్తరించడం వల్ల సాపేక్షంగానూ, నిరపేక్షంగానూ దాని సంఖ్య క్రమక్రమంగా తగ్గుతుంది; కొన్ని సందర్భాల్లో అది చీలిపోవడానికీ, మరింత భవిష్యదవకాశాలుగల పాదార్థికోత్పత్తి రంగంలో నూతన కార్మికవర్గ కేంద్రకం యేర్పడడానికీ దారితీస్తుంది. ముఖ్యంగా వారు బౌద్ధిక శ్రమలో నిమగ్నమయ్యే కార్మికులుగా మారిపోతారని నా అభిప్రాయం.

నూతన శ్రామికవర్గంనుండి మనం యేమి ఆశించగలమనేది యిప్పుడే చెప్పడం కష్టం. అయితే మనం నిరాశలో పడిపోయి శాస్త్రీయ సోషలిజం నిర్మాతలు సోషలిస్టు విప్లవంతో ముడిపెట్టిన సామాజిక శక్తి నన్నగిలిపోవడం కళ్లారా చూస్తున్నామని అనుకోకూడదు. గత శతాబ్దంలో, యీ శతాబ్దపు మొదటిపాదంలో మన అధ్యాపకులు వూహించి చెప్పినదంతా నిజంకాలేదనే విషయాన్ని కూడా విస్మరించ కూడదు.

దీన్నంతటినీ క్షుణ్ణంగా పరిశీలించి అధ్యయనం చేయాలి. పెట్టుబడిదారీవిధానం, సోషలిస్టు సమాజాల అభివృద్ధికి సంబంధించిన ఆదిమ భావాలను వదిలించుకునే సమయం ఆసన్నమైంది.

ఒక మార్క్సిస్టుగా నేను సాధారణ సైద్ధాంతిక అర్థంలో సాంప్రదాయ ప్రతిపాదనను మళ్లీ గుర్తు చేయదలిచాను. ఒకప్పుడు ఫ్యూడలిజాన్ని పెట్టుబడిదారీ విధానం తొలగించినట్టుగానే, పెట్టుబడిదారీ విధానాన్ని సోషలిజం తొలగించగలదు. కాని ఒక పరిశోధకునిగా నేను యిప్పుడు చెప్పినదానికి మినహాయింపు వుందని చెప్పడానికి వెంటనే సిద్ధపడుతున్నాను, యెందుకంటే యిప్పటికీ నేను చూడని నిర్వివాదమైన రుజువులు నాకు అవసరం. అయితే మార్క్సిస్టుగా నాకు యిది తెలుసు: ఒక నిర్దిష్ట సామాజిక వ్యవస్థ చారిత్రక ప్రగతి దాని నైతిక అభివర్గాల వల్లనే కాక సామాజిక ఉత్పత్తిని మరింత బాగా నిర్వహించగలిగే, అధికతర శ్రమ ఉత్పాదకతను సాధించగలిగే దాని శక్తివల్ల కూడా నిర్ధారణ అవుతుంది. తనకు ముందున్న సమాజంపై ఫ్యూడలిజం పైచెయ్యి సాధించడానికి, లేదా ఫ్యూడలిజంపై పెట్టుబడిదారీ విధానం పైచెయ్యి సాధించడానికీవీలు కల్పించినదిదే.

ఒక సామాజిక వ్యవస్థ, దాని వనరులన్నీ హరించుకపోయిన తర్వాతే నశిస్తుందనే మార్క్సు థీసిస్‌ను మనం విస్మరించకూడదు. నూతన వ్యవస్థ అధికతర శ్రమ ఉత్పాదకత ద్వారా తన ఆధిక్యతలను నిరూపించుకోగలదని సోవియట్ పాలన తొలి సంవత్సరాల్లో లెనిన్ వెల్లడించిన అభిప్రాయం నేటికి కూడా వర్తిస్తుంది.

ప్రపంచ శక్తుల్లోని ప్రస్తుత పొందికవల్ల ప్రస్తుత చారిత్రక పరిస్థితుల్లో వర్ధమానదేశాల హోదాను అర్థంచేసుకోడానికి మన కృషి నుండి యెలాంటి నిర్ధారణలు చెయ్యవచ్చు? ఉన్నదున్నట్లుగా మనం చూద్దాం: నవ స్వతంత్ర దేశాల్లో పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధి అంటే అర్థం యెలాంటి నష్టాలు సంభవించినా సరే అది చారిత్రక ప్రగతి కిందే లెక్క. ప్రత్యామ్నాయ అభివృద్ధికి యితర యెలాంటి అవకాశాలు లేని

పక్షంలో ఆ క్రమాన్ని నిరోధించే ప్రయత్నా లన్నీ తత్సంబంధిత దేశ వెనుకబాటుతనాన్ని యధాతథంగా వుంచగలవు. దీన్ని అంగీక రించని వారెవరైనాసరే 1911 జనవరి 3న గోర్కీకి లెనిన్ రాసిన లేఖలోని యీ అర్థవంత మైన, యెంతో గతితార్కికమైన వాక్యాన్ని చదవాలి: "యేఒక్క అభివృద్ధి నిరోధక చర్యను కూడా, ట్రస్టులను నిషేధించటం, వ్యాపారాన్ని పరిమితం చేయడంలాంటి తదితర చర్యల ను కూడా మార్క్సిస్టులు సమర్థించ జాలరు."

వేరుమాటల్లో చెప్పాలంటే విప్లవ పరిస్థితి లేనపుడు నిజమైన ప్రత్యామ్నాయం లేనపుడు పెట్టుబడిదారీ విధానం పురోగమిస్తే, దాని అభివృద్ధిని వ్యతిరేకించడమనేది అభివృద్ధి నిరోధక స్థానాలకు వెళ్లిపోవడమే అవుతుంది. కార్మికులముందు పెట్టుబడిదారీ విధానాన్ని ఎండగట్టాల్సిన అవసరాన్ని "శ్రా మికవర్గ పోరాటంకోసం స్వేచ్ఛను పరిరక్షించు కునేందుకు" కార్మికులను సమీకరించాల్సిన అవసరాన్ని అదే సమయంలో లెనిన్ పేర్కొ న్నారు. యిది పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిని మందగింపజేయదు, సరికదా త్వరితమొనర్చుతుంది, మరింత నాగరిక, సాంకేతికంగా ఉన్నతపరిస్థితుల్లో పెట్టుబడి దారీ విధానాన్ని నిర్వహించడానికి వత్తిడిచే స్తుంది.

నవ స్వతంత్రదేశాల్లో పెట్టుబడిదారీ విధానాన్ని అంతర్గత, బాహ్యకారకాలు పెంపొందిస్తాయి. విదేశీ డబ్బును, శాస్త్ర సాంకేతిక సహాయాన్ని ఆకర్షించకుండా, నిపుణులను సంప్రతించకుండా, తరచు ఆహారపదార్థాల ను దిగుమతి చేసుకోకుండా త్వరితగతి అభివృద్ధిలో తర్వాతిదశ అసాధ్యం. వాటి ఆర్థి కవ్యవస్థలు చాలావరకు సోషలిస్టు ప్రపంచంతోకాక పెట్టుబడిదారీ ప్రపంచంలో అనుసంధించబడివుంటాయి.

మాజీ వలసల్లో, అర్థవలసల్లో సామాజికాభి వృద్ధి వున్ముఖతను నిర్వచించడంలో తప్పుడు అంచనాలకు కారణమేమిటి? గంభీరమైన అధ్యయనాలకు సంబంధించినంతవరకు వాటిలో అధికభాగం తృతీయ ప్రపంచంలో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి పద్ధతుల గురించిన యూరోసెంట్రిక్ భావాలకు లోనయ్యాయి. ఆ భావాలు ఆ పెట్టుబడిదారీ వున్ముఖాభివృద్ధి తాలూకు సంక్షోభాలపై అపరిమితమైన వక్కాణింపును వుంచాయి. యీ అభివృద్ధే దానికి భవిష్యత్తు లేదని చెప్పడానికి రుజువుగా పేర్కొన్నాయి. యీ దేశాల విజయాలు భారీస్థాయి అధునాతన వుత్పత్తిలో ముడివడివున్నాయనీ, వాటికి రాజ్యం మాత్రమే దన్నునివ్వగలదని పేర్కొన్నా యి. అదేసమయంలో ఆభావాలు మధ్యరకం, చిన్నరకం పరిశ్రమాది సంస్థలను నిర్లక్ష్యం చేశాయి. తీవ్ర సామాజిక సమస్యలను, ముఖ్యంగా నిరుద్యోగాన్ని పరిష్కరించడంలో పెట్టుబడిదారీ విధానానికిగల శక్తిని తక్కువ అంచనా వేశాయి. కానీ, అసలు విషయమే మంటే నవస్వతంత్రదేశాలు తమసొంత నమూనా పెట్టుబడిదారీ విధానాన్ని రూపొందించుకుంటున్నాయి. యిది మొదటి నమూనాకు (బ్రిటన్, ఫ్రాన్స్), తుదకు రెండవ నమూనాకు (జర్మనీ, రష్యా, ఇటలీ, యితరదే శాలు) భిన్నమైన మూడవ నమూనా. యీ మూడవ నమూనా విభిన్నదశలు, విభిన్న రకాల అభివృద్ధులతో సాగుతుంది; ఆర్థిక సంబంధాలను నిర్వహించే, క్రమబద్ధంచేసే భిన్నమైన పాత్రను యిందులో రాజ్యం నిర్వ హిస్తుంది. ఇక సంక్షోభాల విషయానికొస్తే అపరిణత దశలోవున్న ప్రతిఒక్క సామాజిక వ్యవస్థలో తుదకు సోషలిస్టు వ్యవస్థలో కూడా సంభవించే అవకాశాలుంటాయి. ముఖ్యమైన విషయమిది: పిల్లలకు యేవిధంగానైతే తమ తలిదండ్రులను ఎంచుకునే అవకాశం లేదో అలాగే సమాజం యెలాంటి డిక్రీలు జారీచే సికూడా ప్రకృతి అభివృద్ధి నియమాలను రద్దు చేయలేదు. మార్క్స్ నొక్కి చెప్పింది దీన్నే.

(ఇంటర్నేషనల్ ఎఫైర్స్ పత్రికనుండి సంక్షి ప్తం)



"శిలువపైనుండి దించుతున్న" దృశ్యం. నొవొగొరొద్ చిత్రరచనా సాంప్రదాయం, 15వ శతాబ్దం

# పునరుత్థానంపై మత గురువుకూ నాస్తికునికీ మధ్య చర్చ

[illegible]

[illegible]

## సెస్లావాస్ కవలియాస్కాస్

ఈ జీసస్ క్రీస్తుకు దేవుడు మళ్ళీ ప్రాణం పోశాడు. దీనికి మనమంతా సాక్షులం. అపోస్టల్స్ సువార్తలు, 2 : 32

"ఇప్పుడు క్రీస్తు మృతుల నుంచి లేచాడు. నిద్రించిన వారి తొలి ఫలమయ్యాడు." అన్న క్రీస్తు ప్రథమ శిష్యుల మతాన్ని సహేతుక తర్కంతో అంగీకరించేలా చేయవచ్చునని చూపడానికి నేనీ వ్యాసం రాశాను. తమ గురువును నానా దుర్భాషలాడి క్రూరంగా చంపడం వారు చూచారు. వెంటనే వారు పెంతెకోస్త్ రోజున (క్రీ.శ.30) జెరూసలేం దేవాలయం వద్ద చేరారు. అక్కడ గుమిగూడిన పెద్ద జన సందోహాన్ని ఉద్దేశిస్తూ,

పీటర్ మిగతా 11 మంది క్రీస్తు శిష్యులతో కలిసి నిల్చుని "....యూదులారా, జెరూసలేం వాసులారా, మీరు చంపిన ఆయన్ను (నాజరేత్ జీసస్‌ను) దేవుడు లేపాడు. దానికి మేము సాక్షులం," అని ఎలుగెత్తి చాటారు. ఈ సాక్షులను మనం నమ్మవచ్చునా?

క్రీ.శ. 35-40 నాటి సాంప్రదాయాలుగల సువార్తల గ్రంథం, తదితర రుజువులపై మనం ఆధారపడవచ్చునని మా అభిప్రాయం. తుదకంటాచూస్తే అపోస్టల్స్ సాక్ష్యాన్ని మనం ఆమోదించడమో, తిరస్కరించడమో, మన విశ్వాసంపై ఆధారపడి ఉంటుంది.

అన్నిటికంటే పురాతన ఆధారాలు ఉదాహరణకు, థెస్సలోనియన్లకు పాల్ రాసిన మొదటిలేఖ, (క్రీ.శ. 50 లేక 51), కోరింతియాన్లకు అయన మొదటి లేఖ (క్రీ.శ. 56) క్రీస్తు పునరుత్థానం సత్యమేనంటున్నాయి. కోరింతియాన్లకు పంపిన లేఖకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. యిది విశ్వసనీయమైన సాక్ష్యాలను పేర్కొంటోంది. "ఆయన (క్రీస్తు) ఒకేసారి ఐదువందలమందికి పైగా సోదర సోదరీ మణులకు కనిపించారు" (15:6) అని చెబుతోంది. పాల్, తదితర అపోస్టల్స్‌తోపాటు, యూదులు కూడా ఈ ఘటనను చూచారని సువార్తలు పేర్కొంటున్నాయి. అయితే, మన ఆధారాలు క్రీస్తు ఎలా తిరిగి లేచాడో వివరించలేదు. ఆ గ్రంథకర్తలు తమకు తెలియని విషయాలు వర్ణించే దుస్సాహసం చేయలేదు. పునరుత్థానమంటే పునరుద్ధరణ కాదనీ, మానవుని అనుభవానికి అతీతమైన, ఈ ప్రపంచానికి చెందని ఉన్నత ఆత్మకు పరివర్తన అని పాల్ నొక్కి చెప్పారు. ఏమైనప్పటికీ, దేవదూతలు, స్వయంగా ఏసుక్రీస్తు ప్రత్యక్షంకావడమన్న అద్భుతాన్ని సువార్తలు వివరంగా వర్ణిస్తున్నాయి. దేవుని సందేశాన్ని తెచ్చిన ఒక దేవదూతను గురించి అన్నిటికంటే పురాతన సువార్త చెబుతోందని మార్క్ అంటున్నారు. ఆ తర్వాత కాలం సువార్తలు జీసస్ క్రీస్తు తన శిష్యులకు కనిపించారనీ, వారికి రొట్టె, చేపలతో విందుచేశారనీ చెబుతున్నాయి. వినికిడి గాథలపై, సాంప్రదాయాలపై ఆధారపడి చేసిన రచనలే తర్వాతి లిఖిత ఆధారాలు కావచ్చు.

ఈస్టర్ సంబంధ అద్భుతాలను చూచినవారు ఎంత భయపడిపోయారో సువార్తలు నొక్కి చెబుతున్నాయి. అవి, అనుకోకుండా సంభవించడంవల్ల ఆయన శిష్యులు జరుగుతున్నదేమిటో అర్థం చేసుకోలేక పోవడం, ఈ ఘటనల వర్ణనల్లోని పరస్పర విరుద్ధతకూ, గందరగోళానికీ కారణం కావచ్చు. సాధారణంగా వినికిడిగాథల, సంప్రదాయాల విషయంలో జరిగినట్టుగానే వాటి బహుళత్వమే మొత్తంపైన వాటి ప్రామాణికతనూ, జీవశక్తినీ నిరూపిస్తోంది.

మారురూపంలో ఉన్న తమ ప్రభువును గుర్తించడానికి శిష్యులకు కొంత సమయం పట్టింది. "మొదట వారు భయపడిపోయారు. తర్వాత తమకు ఆయన ఆత్మ కనిపించిందని ఊహించారు" అని ల్యూక్ చెబుతున్నారు. జీసస్ క్రీస్తు "వారి మధ్య నిలబడి అట్టే అంతర్థానం అయ్యారు" అని ఎవాంజెలిస్టులు పేర్కొన్నారు.

పాల్ సువార్తలు, యితర సువార్తలూ పేర్కొన్న జీసస్ ఆకృతులసంఖ్యలో తేడావుంది. కాని అవి చాలా రోజులు కనిపించాయని అవి ఏకగ్రీవంగా చెబుతున్నాయి. కాబట్టి యిదంతా వారి భ్రమ అని కొట్టివేయలేము.

## విరుద్ధసాక్ష్యం

క్రీ.శ. 56 నాటి కోరింతియన్లకు పాల్ రాసిన మొట్టమొదటి లేఖలో జీసస్ సమాధిని గురించిన అన్నిటికంటే పురాతనమైన ప్రస్తావనలున్నాయి. దీనికి సంబంధించిన

ఘటనల, దీనిలో పాల్గొన్న వ్యక్తుల వర్ణన పుక్కిటి పురాణంగా కనిపించదు. క్రీస్తు పునరుత్థానంపై పరస్పర విరుద్ధ పాఠాలు అనేకముండటమే ఇది నిజంగా జరిగిన ఘటన అన్నదానిం రుజువు. క్రీస్తు శిష్యులు ఆయన భౌతిక కాయాన్ని రాత్రికిరాత్రే దొంగిలించి ఆ భౌతిక కాయాన్ని నిలబెట్టి ఆయన పునరుత్థానం చెందినట్టు భ్రమింప జేశారన్న అపప్రథ ఉంది. దీన్ని ప్రచారం చేసిన వారికి పునరుత్థానం అంటే తెలియదు. భౌతిక కాయం పునరుత్థానం చెందిందనుకున్నారు. కానీ, భౌతిక కాయం పునరుత్థానం చెందలేదు. పునరుత్థానం చెంది ది ఆయన దివ్యశరీరం. ప్రజలకు దర్శనమిచ్చింది. ఆయన ఆత్మ స్వరూపం.

## పాల్ సాక్ష్యం

పునరుత్థానాన్ని ప్రథమంగా వర్ణించింది సెయింట్ పాల్ లేఖయే. పునరుత్థానం చెందింది క్రీస్తు భౌతిక కాయం అన్నవాదాన్ని ఆయన ఖండించారు. పునరుత్థానం చెందింది క్రీస్తు దివ్యకాయమని ఆయన చెప్పారు.

మన పాపాలకు క్రీస్తు ఎలా మరణించాడో బైబిల్‌నుండి తాను తెలుసుకున్నదాన్ని చెబుతున్నానని, క్రీస్తు భౌతిక కాయాన్ని పూడ్చిపెట్టారనీ, మూడవ రోజున క్రీస్తు మళ్ళీ లేచారని అది చెపుతున్నదనీ క్రీస్తు సెఫాన్‌కు కనిపించారనీ, తర్వాత 12 మందికి కనిపించారనీ, తర్వాత ఐదువందలమందికి ఒకేసారి కన్పించారనీ వారిలో చాలామంది తానా లేఖ రాసేనాటికీ సజీవులుగా ఉండినారనీ, కొద్దిమంది మాత్రమే చనిపోయారనీ, ఆ తర్వాత క్రీస్తు జేమ్సుకు కనిపించాడనీ, ఆ తర్వాత తన శిష్యులందరికీ కనిపించారనీ, అందరికన్నా ఆఖరున క్రీస్తు తనకు కనిపించారనీ, కోరింతియన్లకు తన మొదటి లేఖలో (15:3-8) పాల్ చెప్పారు.

"నేను కూడా తెలుసుకొన్న విషయాలు మీకు చెబుతున్నాను." అనీ, "బైబిల్ ప్రకారం" చెపుతున్నాను అనీ యీ శిష్యుడు చెప్పిన మాటలకు ఆధారం మౌఖిక మయినదీ; అది పాత నిబంధనలోని ప్రవచనాలపై ఆధారపడినదీ, కాబట్టి ఎంతో విశ్వసనీయమైనదనీ నిరూపిస్తున్నాయి. ఈ లేఖ యూదు జాతి క్రైస్తవులకు ఉద్దేశించి నది, యూదేతరులను ఉద్దేశించినది కాదు, యిందులో సందేహం లేదు. తనకు యెంతో గౌరవనీయులైన జెరూసలేం క్రైస్తవులను ఉద్దేశించి క్రీ.శ. 56 లో పాల్ ఈ లేఖ రాశారన్న విషయం నిజమే. తాను క్రైస్తవ మతం పుచ్చుకున్న తర్వాత అరేబియాకు వెళ్లాననీ...., మూడేళ్ళ తర్వాత పీటర్‌ను చూడటానికి జెరూసలేం వెళ్ళాననీ, ఆయనతో 15 రోజులు గడిపాననీ, తర్వాత పధ్నాలుగేళ్ళ అనంతరం తాను మళ్ళీ జెరూసలేం వెళ్ళాననీ,... వారికి సువార్తను అందించాననీ...., సజ్జనులుగా పేరున్న వారికి వ్యక్తిగతంగా ఈ సువార్తను వినిపించాననీ పాల్ చెప్పారు.

ఆ కాలంలో సెయింట్ పీటర్ ఉండినట్టి అతిపురాతన చర్చిలో పాల్ క్రీస్తు మతం స్వీకరించారు. ఇది జరిగింది క్రీ.శ. 35-40 లలో అనేది నిస్సందేహం.

సెయింట్ పాల్ కాలంలో జీవించిన అనేకమంది సాక్ష్యాలు పునరుత్థానాన్ని గురించిన విశ్వాసానికి గట్టి ఆధారాలను కూర్చుతున్నాయి. పాల్ సాక్ష్యం. పునరుత్థానాన్ని ఎలాంటి భ్రమలూ లేకుండా చూడటానికి ఈ సాక్ష్యం తోడ్పడుతోంది.

క్రీస్తు మరణించి, కీర్తి నార్జించిన తొలి సంవత్సరాల్లో క్రీస్తు పునరుత్థానాన్ని ప్రత్యక్షంగా చూచిన వారి తిరుగు లేని సాక్ష్యం మనకు వారసత్వంగా లభించింది. వారిలో

చెప్పారు: "ఏసును దేవుడు లేపాడు. మేమంతా చూచాము" (యాక్ట్స్ 2:32) జెరూస లేంలోని శ్రోతల ముందూ, రోము సామ్రాజ్యమంతటా చెల్లాచెదురుగా ఉన్న యూదుల ప్రార్థనా సమావేశాల్లో ఈ శిష్యులు మతోపన్యాసాలు యిచ్చారు. ఈ శిష్యుల సాక్ష్యం. అబద్ధం అయివుంటే వీరి ఉపన్యాసాలు వింటున్న జనసమూహాలు ఈ సాక్ష్యాన్ని తృణీకరించి, త్రోసిపుచ్చేవారు. కాబట్టి శిష్యుల బోధనలు నిజమైనవని మనం గట్టి నిర్ధారణకు రావచ్చు.

## మార్క్ సాక్ష్యం

అన్నిటికంటే ప్రాచీనమైనదైన మార్క్ సువార్తను పరిశీలిద్దాం. దీని ముగింపు వాక్యాలు (16:1-8). సమాధిలోని వివరించశక్యంగాని ఆకృతిని చిత్రిస్తోంది; "తెల్లటి అంగీ వేసుకున్న ఒక యువకుడు"—దేవదూత—"కుడివైపు కూర్చుని ఉన్నాడు." "భయపడకండి, మీరు వెదుకుతున్నది సిలువ వేయబడ్డ నజరేతు ఏసును. ఆయన ఇక్కడ లేడు. సజీవుడుగా లేచాడు. వారు ఆయన భౌతిక కాయాన్ని ఉంచిన స్థలం చూచుకోండి, అని ఆ యువకుడు అన్నాడ ని మార్క్ చెప్పారు.

మొత్తం పైన సారాంశం యిదీ:

(ఎ) క్రీస్తు ప్రథమ శిష్యుల విశ్వాసాన్నీ దాన్ని వారు క్రీ.శ. 35-40 లకు ముందు బోధించిన రీతినీ తిరిగి సమన్వయం చేయడానికి కొత్త నిబంధన తొట్టతొలి పాఠాలు వీలు కలిగిస్తున్నాయి. పునరుత్థాన సిద్ధాంతం ప్రాచీన క్రైస్తవ మత పునాదిరాయి అని పాల్ సాంప్రదాయానికీ, సువార్తలకు అనుగుణంగా ఆ పాఠాలు తిరుగు లేకుండా నిరూపిస్తున్నాయి.

(బి) ప్రాచీన సాంప్రదాయం, తన శిష్యులకు క్రీస్తు కనిపించిన మాట నిజమని నిస్సందేహంగా చెబుతోంది మాథ్యూ, ల్యూక్, జాన్‌లు చెప్పిన విషయాల్లో ఊహాగా నాలపై ఆధారపడిన కథలు ఆ తర్వాత మాత్రమే చోటు చేసుకున్నాయి.

## ముగింపు

క్రీస్తు పునరుత్థానం గురించి మనం చెప్పినప్పుడల్లా, పూర్వపు పాలస్తీనా సర్వావృత దైవభక్తిని మనం జ్ఞాపకముంచుకోవాలి. యూదు చట్టం ప్రకారం జీసస్ "దైవ శప్తుడైన" పాపి. పాల్ కింది విధంగా రాసినప్పుడు, ఆయన మనసులో ఉన్నదిదే: "చట్టం మనకొక శాపం కాకుండా క్రీస్తు రక్షించాడు. ఎందువల్లనంటే, చెట్టుపై ఉరితియ్యబడిన ప్రతి ఒక్కరూ శాపగ్రస్తుడు అని అందులో రాయబడింది."

జీసస్ నేరస్తుడన్న తీర్పు, ఆయన్ను శిలువ వెయ్యటం—ఇవి ఆయన మోక్ష ప్రదాత కాదనేందుకు రుజువని పూర్వాచార పరాయణులైన యూదుల విశ్వాసం. డ్యూటరానమీ ప్రకారం క్రీస్తు శప్తుడు. కాని, పెంతెకోస్తు దినం మృత్యువును కబళించిన విజయదినం. జెరూసలేంలోని దాదాపు 3 వేలమంది క్రైస్తవమతం స్వీకరించడంతో క్రైస్తవచర్చి ఆవిర్భవించింది. ఆనాడు క్రీస్తు శిష్యుల భవిష్యత్తు మారిపోయింది. కాలికి బుద్ధి చెప్పే పిరికి పందలుగా ఉండిన వీరు ధైర్యంగా తమపాపాలు ఒప్పుకొనే క్రైస్తవులయ్యారు. పాల్ యిందుకు మంచి ఉదాహరణ. కొత్తగా మతం పుచ్చుకున్న ఒకప్పటి క్రైస్తవ విరోధి, తర్వాత పునరుత్థానం గురించి బోధించటమేకాక క్రీస్తుపట్ల ఒక కొత్త వైఖరికి ఆద్యుడయ్యారు. ఈ వ్యాసంలో నేను మతధర్మ శాస్త్ర విషయాలు లోతుగా చర్చించ పూనుకోలేదు. జీసస్ క్రీస్తు పునరుత్థానాన్ని నేనెందుకు నమ్ముతున్నాను అనే ప్రశ్నకు సమాధానం చెప్పి నాననుకుంటున్నాను.

# వేరు విధంగా ఆలోచించడానికి ఆధారమేమిటి?

## వల్యేరి లొబచేవ్

నా వ్యాస శీర్షికలోని ప్రశ్నకు అర్థమేమిటో మొదట వివరిస్తాను. పునరుత్థానంపై నమ్మకముండేలా నన్ను పెంచలేదు. కాని, ఫాదర్ కవలియాస్కాస్ ప్రగాఢ విశ్వాసం నన్ను ఆకర్షించింది. పాఠకులు కూడా నాలాగనే ఆకర్షితులవుతారని అనుకొంటున్నాను. బహుకొద్దిగానూ, పరస్పర విరుద్ధంగానూ ఉన్న చారిత్రక ఆధారాలను పరిశీలించే ప్రతి పండితుడిలాగానే నాకొక విషయం తెలుసు. అతి ప్రాచీన కాలం నాటి లిఖిత మతధర్మాలను నమ్మవచ్చు, లేదా వాటి ప్రామాణికతను సంశయించవచ్చు. ఈ సంశయ పూర్వక విశ్లేషణకాని, గాఢ విశ్వాసంగాని వారి ఎంపికను బట్టి వుంటుంది నిర్వివాద విషయాలేవో, వివాదగ్రస్త విషయాలేవో వాటిని పోల్చిచూడటం ద్వారా చెప్పడం అసాధ్యమైనప్పుడు, ఏనాడో గతించిన కథకుని మనస్తత్వాన్ని గురించి సరికొత్త వ్యాఖ్యానం చెయ్యడానికి మన శక్తియుక్తులన్నిటినీ ఉపయోగించవలసిన సమయం వస్తుంది.

అతని గురించిన కథలోని వైరుధ్యాలు అప్పటికప్పుడు ఆశువుగా చెప్పినందువల్ల దొరలినవని అనిపిస్తుంది. కొత్త నిబంధన సూక్తులలోని వైరుధ్యాలే వాటి ప్రామాణికతకు రుజువని అందువల్లనే ఫాదర్ కవలియాస్కాస్ భావిస్తున్నారు. ఆయన వాడిన కొలమానాన్నే బైబిల్‌కు వర్తింపజేయడం ద్వారా, పూర్తిగా వ్యతిరేకమైన నిర్ధారణను చేయవచ్చని నేను నిరూపించదలచాను.

1. కొత్త నిబంధనలోని మనస్తత్వ సంబంధమైన అంశాలే ఆ గ్రంథ ప్రామాణికతకు సాక్ష్యమని ఫాదర్ కవలియాస్కాస్ అంటున్నారు. ఆయన వాదనను మరింత సూటిగా చెబుతాను. దిగ్భ్రమజనకమైన పునరుత్థాన భావం ఎవెంజెలిస్టుల మనసులోకి ఆకాశం నుంచి ఊడిపడిందా? ఇది అసంగతం. ఏసుక్రీస్తు చరిత్ర కథనానికి పరాకాష్ఠ. ఆయనచేసిన అద్భుతాలు, బోధలూకాదు; ఆయన పునరుత్థానం. ఏసు దివ్యత్వాన్ని బహిర్గతం చేస్తున్నది, ఆయన పుట్టుకకాదు, ఆయన పునరుత్థానం. ఇది ఆయన వాదం.

మృతుడు తిరిగి లేవడానికి సహేతుకమైన కారణం మనం చెప్పలేనంత మాత్రాన అటువంటి ఘటన అసంభవమని అనటం అంతగానూ అసంగతమని విజ్ఞానశాస్త్రం అంటుంది. ప్రకృతి ఏదైనా విచిత్రమైనది చేసేటప్పుడు, మనల్ని అడిగి చేయదు. కాబట్టి, పునరుత్థానాన్ని నిర్ద్వంద్వంగా తోసివేసే ప్రశ్నేలేదు. అది సాధ్యమా అని శంకిస్తాము, అంతే.

పునరుత్థానాన్ని జాగ్రత్తగా పరిశీలించి, దాన్నొక చారిత్రక ఘటనగా నమోదు చేసివుంటే, ఈస్టర్ పండుగలకు సంబంధించిన ఘటనలు యేవిధంగా పరిణమించి వుండేవో, ఊహించడానికి ఫాదర్ కవలియాస్కాస్ అవలంబించిన విశ్లేషణాత్మక మనస్తత్వ పరిశీలనా పద్ధతినే మనమూ అవలంభిద్దాం. పునరుత్థానం ఆనాటి వారిలో మత భావావేశం. రేకెత్తించి వుండేదా?

ఆ దిగ్భ్రమజనకమైన ఘటన అటువంటి భావావేశానికి కొంతవరకు కారణభూతమై వుండవచ్చు. కాని, లిఖిత సాక్ష్యాధారాలు విస్తృతంగా వుండేకొద్దీ మత విశ్వాసాలకు అవకాశం తగ్గుతుంది.

ఇందుకు అగ్ని పర్వతపు లావా ద్రవం వల్ల నాశనమైన పాంపే నగర విషాదాంతమే ఉదాహరణ. అది ఎటువంటి భక్త్యావేశాన్నీ రేకెత్తించలేదు.

చనిపోయినట్లు మనకు ఖచ్చితంగా తెలిసిన ఒక వ్యక్తి మనకు మళ్ళీ సజీవంగా కనిపించినట్లయితే, 20 వ శతాబ్ది వాళ్లమైనమనం, అసలు ఏమి జరిగి వుంటుందో వాస్తవిక కారణాలు తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తాము. జెరూసలేం అధికారులు వ్యాపింపజేసిన వదంతులు అటువంటివే. ఏసుక్రీస్తును శిలువనుంచి సజీవంగానే కిందికి దించారనీ, లేదా అతని దేహాన్ని సమాధినుంచీ దొంగతనంగా ఎత్తుకపోయారనీ వదంతులు వ్యాపించినట్లు కొత్త నిబంధన చెబుతోంది. వీటివల్ల కొంత నమ్మకం యేర్పడివుంటే, ఈ అద్భుత ఘటనను ఎవరూ అంతపట్టించుకొనేవారు కాదేమో?

పునరుత్థానం జరిగిన తిరుగులేని సందర్భం కనీసం ఒకటైనా చరిత్రలో వుండివుంటే క్రీ.శ. 1 వ శతాబ్ది తొలిరోజుల ఘటనలు మరో విధంగా ఉండేవి. క్రీస్తు పునరుత్థానాన్ని మరో అద్భుత ఘటనగా భావించి అటువంటివి మళ్ళీ జరగవచ్చునని అనుకొనేవారు ప్రళయం వరకూ ఎందుకు కాచుకోవాలి, ఇప్పుడే అమరత్వం సాధిద్దామని జనం అందుకు సానా ప్రయత్నాలను చేసి ఉండేవారు. మానవ స్వభావమటువంటిది.

2. పునరుత్థానానికి ప్రత్యక్ష సాక్షులు ఎవరూ లేనట్లయితే, బైబిల్‌లోవున్న అన్ని సాక్ష్యాధారాలను ఉటంకించడం అసాధ్యం కదా అని ఫాదర్ కవలియాస్కాస్ అంటున్నారు. క్రీస్తు శిష్యుల మాటలను అందరూ ఎద్దేవా చేసివుండేవారని అంటు న్నారు. కాని, ఆ శిష్యులు తిట్లకు భయపడేవారు కాదు. క్రైస్తవమత ప్రచారానికి పూనుకొన్న తొలి బృందాలు, అవహేళనలకు, అపనమ్మకాలకు వ్యతిరేకంగా పట్టుదలతో పోరాడవలసి వచ్చిందని బైబిల్ చెబుతోంది.

ఒక ఉజ్వలమైన స్వప్నాన్ని అవహేళనం చేయలేము. మానవ నిష్కృతి, మోక్షాల గురించిన స్వప్నం మనిషిని ఆకట్టుకొంటుంది. అందువల్లనే పారిపోయే పిరికి పందల్ని అది ధైర్యవంతులయిన మత విశ్వాసులుగా మార్చ గలిగింది. క్రైస్తవమతానికి గల శక్తి ఇదే. ఆ విశ్వాసం మృత్యువును లెక్క చేసేది కాదు.

3 కొత్త నిబంధన, రచనా సంవిధానంలోనూ, ఇతివృత్తంలోనూ గొప్పది. ఒకే విషయాన్ని వివిధ దృక్కోణాలనుంచి చెప్పడం కొన్ని శతాబ్దాలుగా మామూలైంది. కాని, క్రైస్తవ మత ఆవిర్భావకాలంలో అది నిజంగా కొత్తది. ఆనాటి మత సంక్షోభమే, బయటపడే మార్గం చూపింది. బహుభాషా ప్రాంతమైన పాలస్తీనాలో బహువిధశైలి గల సాహిత్య ఉద్గ్రంథం ఆవిర్భవించింది. ఆనాటి న్యాయస్థానాలు, దర్యాప్తు, తీర్పు, జీసస్‌ను పట్టు కోవడం, ఆ తిరుగుబాటు దారుని ధర్మబోధ, తొలి క్రైస్తవ మతాచార్యుల జీవితాలు, కొత్త మతాన్ని తుడిచి పెట్టప్రయత్నించిన రోమన్ సామ్రాజ్య దమన యంత్రాంగం— ఇవన్నీ ఎంతో కళాత్మకంగా సవివరంగా చిత్రించడం జరిగింది.

ఏసుక్రీస్తు అద్భుతాలనన్నిటిని వివరంగా వర్ణించిన కొత్త నిబంధన పునరుత్థాపనను మౌనంగా దాటవేస్తుంది. ఇదొక సాహిత్య ప్రక్రియ చమత్కృతి. ప్రగాఢ విశ్వాసం వల్లనే ఈ రచనా కౌశల్యం అబ్బి ఉండాలి. పవిత్రమైన ఘటనను దైవ దూషకుల కళ్ళకు కనిపించకుండా మరుగు పుచ్చారు. అద్భుతాల్లోకెల్లా గొప్పదీ, ఉదాత్తమైనదీ శాశ్వతంగా నిగూఢంగా వుండిపోయింది. కొత్తటెస్టమెంట్‌ను గురించిన మనస్తత్వ శాస్త్రపరిశోధనలు క్రీస్తు పునరుత్థానాన్ని నేను అంగీకరించేలా చేయవు. కాని ఫాదర్ కవలియాస్కాస్ చెప్పినదాని తాత్పర్యాన్ని మనం అంగీకరించవలసిందే. అదే మంటే మానవ ప్రతిభ సాధించలేనిదేదీ లేదు. అంతేతప్ప, పునరుత్థానం నిజమని నమ్మితీ రాలనేదేమీలేదు.

# చరిత్రపుటలు

## యూరీ జుకోవ్

అనేక అంతర్జాతీయ సమావేశాల్లో, ద్వైపాక్షిక సంప్రతింపుల్లో నిరాయుధీకరణకోసం తీవ్ర అన్వేషణ జరుగుతున్న ప్రస్తుత తరుణంలో, చాలా కాలం క్రితం ఈ సమస్యను చర్చనీయాంశంగా మొదట సోవియట్ దౌత్యవేత్తలు ముందుకు తెచ్చినపుడు యీ క్రమం యెలా ప్రారంభమైందో తెలుసుకోవడం సముచితంగా వుంటుంది.



## ప్రారంభం

ఇదంతా జెనీవాలో జరిగిన తొలి అంతర్జాతీయ సమావేశంలో ప్రారంభమైంది. యీ సమావేశానికి సోవియట్ ప్రతినిధులు హాజరయ్యారు. లెనిన్ ఆదేశం పై 1922 ఏప్రిల్ 10న ఆయుధాల సార్వత్రిక తగ్గింపు ప్రతిపాదనను యీ సమావేశంలో గియోర్గి ఛిచెరిన్ ప్రతిపాదించాడు. యిది పాశ్చాత్య ప్రతినిధుల్లో గందరగోళాన్ని సృష్టించింది. యీ ప్రతిపాదనను వారు తిరస్కరించినప్పటికీ, దీనికి ప్రజలనుండి సానుకూల ప్రతిస్పందన వచ్చింది.

ఆ సంవత్సరంలోనే తర్వాత మాస్కోలో నిరాయుధీకరణ సమావేశం జరిగింది. యిందులో సోవియట్ రష్యా పొరుగు యూరపియన్ రాజ్యాలు పాల్గొన్నాయి. ఆయుధాలను గణనీయంగా తగ్గించాలని సోవియట్. పక్షం సమర్పించిన కొత్త ప్రతి పాదనను వారు మళ్లీ తిరస్కరించారు.

ప్రాశ్చాత్యదేశాలు వ్యతిరేక వైఖరిని కనబర్చినప్పటికీ సోవియట్ దౌత్యవేత్తలు తమ శాంతిదాడిని కొనసాగించారు. 1927-1934 లో శైశవదశలో వున్న సోవియట్ రిపబ్లిక్కు నానాజాతి సమితి చట్ర పరిధిలో నిరాయుధీకరణ సంప్రతింపుల్లో చేరినపుడు శాంతి దాడి పరాకాష్టకు చేరుకుంది.

సోవియట్ ప్రతినిధివర్గం 1927 నవంబరులో జెనీవా చేరుకుంది. నిరాయుధీకరణకు సంబంధించిన నానాజాతి సమితి కమీషన్‌లో చేసిన తమ తొలి ప్రసంగంలోనే సోవియట్ ప్రతినిధివర్గ నాయకుడు మాక్సిమ్ లిత్వినవ్ సార్వత్రిక. సంపూర్ణ నిరాయుధీకరణ ముసాయిదా ఒప్పందాన్ని ప్రతిపాదించారు.

ఈ కమిషన్ ఛైర్మన్ అయిన డచ్ దౌత్యవేత్త లౌడన్ సోవియట్ ప్రతిపాదనపై చర్చను "వాయిదావేయాలని" వెంటనే ఒక సూచన చేసి, నాలుగు రోజుల పాటు సమావేశాన్ని నిర్వహించి ముగించాడు.

## తిరుగులేని ప్రతిపాదనలు

సన్నాహక కమిషన్ తర్వాతి సమావేశం 1928 మార్చి 15 న ప్రారంభమైంది. ఊహించినట్టుగానే యీ కమిషన్ సోవియట్ ముసాయిదా ఒప్పందాన్ని తిరస్కరించింది. అయితే ఆయుధాల "క్రమబద్ధం" గురించి చర్చప్రారంభం కాగానే ఆయుధాలను దామాషా, క్రమానుగతాభివృద్ధి ప్రాతిపదికపై తగ్గించాలనే నూతన ఒప్పందం ముసాయిదాను మాక్సింలిత్వినవ్ ప్రతిపాదించాడు.

అన్ని దేశాలసాయుధ దళాలను సగం తగ్గించాలనీ, "అత్యంత దురాక్రమణ దారీరకాల ఆయుధాలను, రసాయనిక, విషక్రిమి యుద్ధ తంత్ర సదుపాయాలను సాధనాలను ధ్వంసం చేయాలనీ సోవియట్‌యూనియన్ ప్రతిపాదించింది.

సోవియట్ కొత్త ప్రతిపాదనలపై చర్చ మరోసారి వాయిదా పడింది. యీ కమిషన్ 13 నెలల తర్వాత తన పనిని తిరిగి ప్రారంభించిన వెంటనే యీ ప్రతిపాదనలపై చర్చకు కమిషన్‌ను ఒప్పించడానికి సోవియట్ ప్రతినిధి వర్గానికి మూడు రోజులు పట్టింది. యీ ముసాయిదా ఒప్పందంతో పాటు కమిషన్ మెజారిటీ సభ్యుల ముసాయిదాను కూడా ప్రపంచనిరాయుధీకరణ సమావేశానికి సమర్పించడానికి కమిషన్ అంగీకరించింది. యీసారి సోవియట్ ప్రతినిధి వర్గాన్ని జర్మనీ, టర్కీ, చైనాలు బలపర్చడం గమనించతగ్గ విషయం.

ఎట్టకేలకు యీ 15 వ సమావేశం పాశ్చాత్యదేశాల ముసాయిదాలో "ఆయుధాల తగ్గింపు" అనే పదాన్ని చేర్చింది. పాశ్చాత్యదేశాలు లోగడ "పరిమిత" అనే పదం మాత్రమే వుండాలని పట్టుబట్టాయి. నిరాయుధీకరణకు దారితీసే ఆచరణాత్మక చర్యలను ఆమోదించాలని సోవియట్ ప్రతినిధి వర్గం పట్టుబట్టడానికి "తగ్గింపు" అనే పదం తోడ్పడింది.

1929 మే 3 న జరిగిన ఈ కమిషన్ 19 వ సమావేశంలో తనిఖీ సమస్యపై ఆసక్తికరమైన చర్చ జరిగింది. తనిఖీ అసాధ్యమైనదనీ, అందువల్ల ఆయుధాలనిల్వలపై పరిమితి కూడా సాధ్యం కాదని బ్రిటిష్ ప్రతినిధి వర్గం వాదించింది. ఆయుధాలను గణనీయంగా తగ్గించే విషయంలో భాగస్వాములు ఒక అంగీకారానికి వచ్చినట్టయితే అంతర్జాతీయ అజమాయిషీ యేర్పాటు ద్వారా తనిఖీ సమస్యను పరిష్కరించ వచ్చని లిత్వినవ్ (1929 లో) ప్రకటించాడు.

నిరాయుధీకరణకు యెలాంటి అవకాశాలు చేజారి పోయాయో తెలుసుకోడానికి యిది యెవరికైనా వుపక రిస్తుంది.

ఆయుధాల "స్తంభన" గురించిన మరో ప్రధాన ప్రతిపాదనను కమిషన్ 20 వ సమావేశంలో సోవియట్ యూనియన్ చేసింది. ఆయుధాలను ఆధునికీకరించబోమనే శపథాన్ని చర్చల్లో పాల్గొంటున్నదేశాలు చేయాలని యీ ప్రతిపాదన లోవుంది. కాని సోవియట్ చేసిన యీ ప్రతిపాదనను కూడా తిరస్కరించడం జరిగింది.

## "బాహాటత" గురించి ఒకమాట

ముమ్ముందు జరుగనున్న సమావేశంలో చర్చించేందుకు తమ తమ సాయుధ దళాలకు సంబంధించిన సమాచారాన్ని అందజేయాలని అన్నిదేశాల ప్రభుత్వాలను 1931 ఫిబ్రవరి 17 న నానాజాతి సమితి సెక్రటేరియట్ కోరింది.

ఈ విజ్ఞప్తిని సోవియట్ యూనియన్ ఖాతరు చేయదని పాశ్చాత్య దేశాలు భావించాయి. అందువల్లనే ప్రతిపాదిత సమావేశం జరుగకుండా పోయిందని సోవియట్ యూనియన్‌ను నిందించ వచ్చని ఆశించాయి. కాని ఏప్రిల్ 25న నానాజాతి సమితి సెక్రటరీ జనరల్ ఎరిక్ డ్రమ్మాండ్‌కు విదేశీ వ్యవహారాల పీపుల్స్ కమీస్సార్ మాక్సింలిత్వినవ్ యీ కింది సమాధానం పంపారు.

"1931 జనవరి 1 నాటికి సోవియట్ యూనియన్‌కు 504,303 మంది పదాతి సైనికులు, 28,658 మంది విమానదళ సైనికులు, 29,039 మంది నావికాదళ సైనికులు వున్నారు. 37,700 కమాండర్లతో సహా మొత్తం సంఖ్య 562,000 "

"సైనిక ఆర్గనైజేషన్లకు చెందిన యూనిట్ల బలం యిది: సరిహద్దు దళాలు 28,150, ఆంతరంగిక భద్రతా సైనికులు 17,240 మంది."

"750 విమానాలున్నాయి. విమానవాహక నౌకలు, ఎయిర్ షిప్స్ లేవు. మూడు యుద్ధనౌకలు, రెండు క్రూయిజర్లు 17 డెస్ట్రాయర్లు, 16 జలాంతర్గాములు, రెండు మందు పాతరలు వేసే నౌకలు, 6 మంది పాతరలను తొలగించే నౌకలు వున్నాయి. వీటి మొత్తం సంఖ్య 46."

ఈ సమాచారంలో యింకా 1931 లో చేయనున్న సైనిక వ్యయాన్ని గురించి సవివరంగా తెలియచేశారు.

"ఇలాంటి సమాచారాన్ని యితర దేశాల ప్రభుత్వాలు పంపాయా." ఒక వేళ పంపితే తనకు అందజేయాలని ప్రత్యేక లేఖలో నానాజాతి సమితి సెక్రటరీ జనరల్‌ను లిత్వినవ్ కోరారు.

ఈ సమావేశంలో పాల్గొనడానికి ఆహ్వానింపబడిన 63 ప్రభుత్వాల్లో 25 మాత్రమే అవసరమైన సమాచారాన్ని అందజేశాయని ఎరిక్ డ్రమ్మాండ్ అక్టోబరు 7 న అసమ్మతిని ప్రకటించాడు.

1931 లో సోవియట్ దౌత్య నీతి విజయవంతంగా అమలు జరిపిన బాహాటతా విధానాన్ని తర్వాతి సంవత్సరాల్లో సోవియట్ నాయకులు విస్మరించారు.

## ప్రపంచ సమావేశం

ప్రపంచనిరాయుధీకరణ సమావేశం జెనీవాలో 1932 ఫిబ్రవరిలో జరిగింది. అప్పటికి యీ సమావేశం పట్ల పాశ్చాత్య దేశాలకు యే మాత్రం ఆసక్తిలేకుండా పోయింది. అందువల్ల యీ సమావేశం నిరాయుధీకరణ భావానికి ఒకవిధంగా అంత్య

క్రియలను నిర్వహించింది.

ఆయుదపోటీ వుచ్చృతంగా సాగి దాని పనిని అది చేసింది. యూరప్‌లో, దూర ప్రాచ్యంలో రాజకీయ పరిస్థితి తీవ్రంగా క్షీణించింది. ఫిరంగుల మోతల మధ్య సమావేశం ప్రారంభమైంది: అప్పటికే అయిదు నెలలుగా జపాన్, చైనాల మధ్య అప్రకటిత యుద్ధం సాగు తోంది. జర్మనీలో నాజీ కుట్ర త్వరితగతిని పెరిగింది. యుద్ధమే తన లక్ష్యమని హిట్లర్ బహిరంగంగా ప్రక టించాడు.

ఇప్పటికైనా ప్రమాదాన్ని నివారించవచ్చునీ, నిరాయుధీ కరణకు యితర దేశాలు కూడ అంగీకరిస్తే సోవియట్ యూనియన్ సాధ్యమైనంత వేగంగా నిరాయుధీకరణకు సిద్ధంగా వుందని 63 దేశాల ప్రతినిధులు హాజరైన సమా వేశంలోలిత్వినవ్ ప్రకటించాడు.

నిర్మాణాత్మకమైన యితర సోవియట్ ప్రతిపాదనల్లను తిరస్కరించినట్టుగానే యీ సోవియట్ ప్రతిపాదనను కూడా సమావేశం పెడచెవిని పెట్టింది.

ఈలోగా పరిస్థితి విషమించ సాగింది. 1933 అక్టోబరులో అధికారాన్ని హస్తగతం చేసు కున్న హిట్లర్ జర్మనీ ప్రతి నిధి వర్గాన్ని సమావేశం నుండి వెనక్కి రప్పించాడు. కొన్ని రోజుల తర్వాత నానాజాతి సమితి నుండి జర్మనీ నిష్క్రమిస్తున్నట్టు ప్రకటించాడు. ఆ తర్వాత జపాన్‌కూడా సమితినుండి నిష్క్రమించిది.

అలాంటి పరిస్థితుల్లో నిరాయుధీకరణకు అవకాశమే లేకుండా పోయింది. ఈ సమావేశం తన ప్లీనరీ సమావేశాలను నిలిపి వేసింది. సైనిక ఒప్పందాల ద్వారా సమిష్టి భద్రతా అన్వే షణకు దౌత్యకృషి మొత్తం మళ్లింది.

ప్రపంచ సమావేశ సాధారణ కమీషన్ తుది సమావేశం 1934 మే 29న ప్రారంభమైంది. నిరాయుధీ కరణ ఆశయాన్ని వదిల వర్చేందుకు సోవియట్ ప్రభుత్వం మరో ప్రయత్నం చేసింది. సంప్రతింపుల యంత్రాంగాన్ని "ఒక శాశ్వత మైన, క్రమానుసారంగా జరిగే శాంతి సమావేశం"గా పరివర్తింప జేయాలని సూచించింది.

సోవియట్ ప్రతిపాదనపై బ్రిటిష్ విదేశాంగ మంత్రి జాన్‌సైమన్ వెంటనే తన దాడిని ప్రారంభించి "ఆయుధ నిల్వలను పెంచు కోవాలి" అనే జర్మనీ డిమాండ్‌ను ఆమోదించాలనీ, లేదా పెట్టే బెడా సర్దుకుని యింటికి వెళ్లి పోవాలనీ సూచించాడు. అది ప్రపంచ సమావేశ గతిని నిర్ణ యించింది.

ఇదీ రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో సోవియట్ దౌత్యవేత్తలు నిరాయుధీకరణ కోసం నిలక డగా జరిపిన పోరాట నాటకీయ చరిత్ర. ఆ పోరాటం విజయవంత మౌతుందా? తిరిగి ఆ ఘటకలే సంభవించవనే గ్యారంటీయేమైనా వుందా?

## గతంనుండి గుణపాఠాలు

సోవియట్ దౌత్యవేత్తలు 1922-1934 లో యెంతో నేర్పుతో నిలక డగా జరిపిన పోరాటం "కమ్యూనిస్టు ప్రమాదం" అనే బూచీని నాశనం చేయ డానికి తోడ్పడింది. యుద్ధాలు, ఆయుధాలు లేకుండా ప్రపంచం మనగలదని వారు రుజువు చేశారు. వారి కృషి ప్రగతిశీల శక్తులస్థానాలను బలపర్చింది.

20లలో, 30 లలో సోవియట్ దౌత్యవేత్తలు జెనీవాలో చేసిన కృషి కూడా భవిష్యత్తుకు మంచి గుణపాఠం. అప్పుడు సోవియట్ దౌత్య వేత్తలను, వారి సూచనలనూ పాశ్చాత్య దేశాలు పట్టించుకో లేదు. కాని రాజకీ యాల్లో బలప్రదర్శన, ఆయుధాలు రాజకీయ సమస్యలను పరిష్కరింపజాలవని యీనాడు నా నాటికీ మరీంత యెక్కువ మంది గుర్తిస్తున్నారు. వారి భావాలు నూతన అర్థాన్ని. నూతన ప్రాధాన్యతను సంత రించుకుంటున్నాయి.

(ప్రావ్దా)



# జ్ఞాని మానవుడు

సావా దాన్‌గులోవ్, రచయిత

ప్రాచీన రష్యన్ దౌత్య సేవలోని ఉత్తమోత్తమ కార్య విధానాలను సోవియట్ దౌత్య సేవలో ప్రవేశ పెట్టిన వారిలో అనువంశిక రష్యన్ దౌత్యవేత్త అయిన విదేశీ వ్యవహారాల పీపుల్స్ కమిస్సార్ (విదేశాంగ మంత్రి) గియోర్గి ఛిచెరిన్ ఒకరు.

విదేశీ వ్యవహారాల పీపుల్స్ కమిస్సారియేట్ లోని కార్యనిర్వాహక సిబ్బందిని యెంచుకునే విషయంలో లెనిన్ గొప్ప దోహదం చేశాడు. ఆయన కమిస్సారియేట్‌ను సందర్శించి కార్యక్రమ పత్రాలను విశదీకరించడంలో పాల్గొనేవారు. వీటిలో ముఖ్యమైనవి: దౌత్యశ్రేణుల గురించిన పత్రం (దీనిపై లెనినూ ఛిచెరిన్ సంతకాలు చేశారు), 1918 జూన్ 30 న కమిస్సారియేట్‌లో జరిగిన సమావేశంలో సోవియట్ దౌత్యసేవలపై రూపొందించిన ప్రసిద్ధ నిబంధనలు

విదేశీ వ్యవహారాల కమిస్సారియేట్ సిబ్బందిని వీరు జాగ్రత్తగా యెంపిక చేశారు. అసాధారణ ప్రాధాన్యతగల కర్తవ్యాన్ని—దౌత్య పరమైన దిగ్బంధనలను ఛేదించి పెట్టుబడిదారీ దేశాలతో ప్రత్యక్ష సంబంధాలను నెలకొల్పుకునే కర్తవ్యాన్ని—నెరవేర్చడానికి దేశం సన్నద్ధ మౌతూండినట్టు యిది తెలియజేస్తోంది. వేరు మాటల్లో చెప్పాలంటే పశ్చిమ దేశాలతో సాధారణ రాజకీయ, ఆర్థిక సంబంధాను నెలకొల్పుకోవాలనే, అందుకోసం అర్హులైన సిబ్బందికి శిక్షణ యివ్వాలనే ఆసక్తి విప్లవానికి వుందన్న మాట. అక్టోబరు విప్లవం వెన్వెంటనే యిది తక్షణ కర్తవ్య మైంది. 1920 లలో యిది మరింత తక్షణ కర్తవ్యమైంది.

విదేశీ వ్యవహారాల పీపుల్స్ కమిస్సారి

*నియామకపత్రాల సమర్పణ. ముందు వరుసలో: గియోర్గి ఛిచెరిన్ (ఎడమ), మిహాయిల్ కాలినిన్ (మధ్య), నార్వే రాయబారి అంద్రియాస్ ఉర్బీ (కుడి).*

యేట్‌లో కాకలు తీరిన దౌత్యవేత్తగా వున్న ఒకే ఒకవ్యక్తి, ఒక ప్రసిద్ధ రష్యన్ కుటుంబానికి చెందిన ఉత్తముడు అయిన గియోర్గి ఛిచెరిన్ కాకలు తీరిన విప్లవయోధుని పథంలో పయనించాడు. ఆయన అనువంశికంగా పొందిన సంపదను పార్టీ ఆశయంకోసం అంకితం చేసి గొప్ప సేవ చేశాడు.

కమిస్సారియేట్‌లో ఆయన తొలి సంవత్సరాల కృషి సాఫీగా సాగలేదు. ఆయనను విమర్శించిన వారిలో ఆయన సహచరులు కూడా వున్నారు. కానీ లెనిన్ సర్వదా ఛిచెరిన్ పక్షమే వహించాడు. ఛిచెరిన్‌ను మెచ్చుకుంటూ లెనిన్ చెప్పిన మాటలన్నీ ఛిచెరిన్ శత్రువులకు తిట్టుగా పరిణమించాయి: "ఛిచెరిన్ అద్భుతమైన, యెంతో చైతన్యవంతుడైన తెలివైన, విజ్ఞుడైన వ్యక్తి. అలాంటి వాళ్లను మెచ్చుకుని తీరాలి. పెత్తనం చలాయించాలనే జబ్బు లేకపోవడమే ఆయనలోని బలహీనత. దానివల్ల యిబ్బంది లేదు. దానికి భిన్నమైన బలహీనత యెంత మందికి వుందో!"

విప్లవ రష్యా విదేశాంగ కార్యాలయ ఆధిపత్యాన్ని స్వీకరించిన ఛిచెరిన్ తన జీవిత పథంలోని యెన్నో విషయాలను పునః పరిశీలించుకోక తప్పలేదు. తన మద్దతుదార్లకోసం, ముఖ్యంగా విద్యావంతులైన మద్దతుదార్ల కోసం ఆయన అన్వేషించాల్సి వచ్చింది. తనకు యిష్టమున్నా లేకపోయినా అనేక విషయాల్లో తనను పోలిన వారిని ఆయన యెంచుకున్నాడు. తుదకు ఆయనచుట్టూ నిజంగా విద్యావంతులైన విజ్ఞుల సముదా

యం రూపుగొంది. వారు తమ విలువల చట్రంలో భావాలకు, నీతికి అగ్రతాంబూలమి చ్చారు. వారికి నాయకత్వం వహించడం సుల భమే కాని, వారిని రెచ్చగొట్టడం యెవరితరమూ కాదని సంవత్సరాలుగా వారితో నిర్వహించిన సంయుక్త కృషి, వల్ల ఛిచెరిన్‌కు తెలియ వచ్చింది. యీ వాస్తవం దృష్ట్యా కాలం గడిచినా కొద్ది వారి పరిస్థితి తీవ్రమై పోయింది. అది "పాలక శిష్టవర్గం"తో సంఘ ర్షణగా పరిణమించింది. ఛిచెరిన్ మాత్రమే గాక యీ సంఘర్షణలో ఆయన మొత్తం బృందం చిక్కుక పోయింది.

లెనిన్ రూపుదిద్దిన దౌత్య సిబ్బందిలోని ఉన్నతశ్రేణులను మొత్తం మీద ఆయన మరణం తర్వాత విచిత్ర మైన స్థితిలో వుంచ డం జరిగింది. రాయబారులకూ, కేంద్రంలోని నాయకత్వానికీ మధ్య పరస్పర అవగాహన లెనిన్ కాలంలో యీ స్వయం స్పష్టమైన సత్యంపై ఆధారపడి వుండింది: లెనిన్‌ను రాయబారులు విశ్వసించారు, రాయబారుల ను లెనిన్ విశ్వసించారు. రాయబార వర్గాల్లో తలెత్తే సమస్యలతో సహా యితర అన్ని సమస్యలపై జరిగే చర్చల్లో లెనిన్ తరచు పాల్గొనడమే గాక యీ సమస్యలను అన్ని పక్షాలకు ప్రయోజనకరంగా పరిష్కరించే వారు. లెనిన్ మరణాంతరం యీ పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

లెనిన్ 1924 జనవరిలో మరణించగా, గియోర్గి ఛిచెరిన్ ఆ తర్వాత ఆరేళ్లకు తన విదేశాంగ కమిస్సార్ పదవిని వదులుకున్నా రు. అంతకు ముందు కూడా—లెనిన్ మరణాంతరం మూడు నాలుగేళ్ళు—ఆయన కమిస్సారియేట్ కృషిలో చురుకుగా పాల్గొనలే దు. తీవ్ర మధుమేహ వ్యాధితో 1936 లో తన 64 వ యేట ఛిచెరిన్ మరణించాడు. తన చివరి పదేళ్ళ జీవితాన్ని ఆయన విదే శాల్లో గడిపాడు. అన్ని సందర్భాల్లోనూ తన యిష్ట ప్రకారమే ఆయన విదేశాలకు వెళ్లలే దని కొందరి అభిప్రాయం.

గియోర్గి ఛిచెరిన్ విదేశాంగ కమిస్సార్ పదవిలో పన్నెండేళ్లు వున్నాడు. యీ కాలంలో ఆయనేం చేశాడు? 1918 లో జర్మనీతో జరిగిన బ్రెస్ట్-లితోవ్స్క్ సంధిపై ఆయనే సంతకం చేశాడు. ప్రాచ్యదేశాలతో కొత్త, న్యాయమైన సూత్రాల ప్రాతిపదికపై సంబంధాలు పెట్టు కుంటానని రష్యా తరఫున ఆయా దేశాలకు విజ్ఞప్తి చేసినది ఆయనే. యివి జాతుల స్వయం నిర్ణయాధికార సూత్రంపై, యీ దేశాలపై జారిజానికి వుండిన ప్రత్యేక హక్కు లను వినర్జించే సూత్రంపై ఆధారపడిన సంబంధాలు. టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ లతో 1921 లో సంతకాలు జరిగిన మైత్రీ సంధులకోసం ఆయన యెంతో కృషి సల్పారు. ఆ తర్వాత 1922 లో జెనీవాలో యీ నూతన రిపబ్లిక్కు ప్రణాళికను ప్రకటిం చాడు. విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాలతో సహజీవన సూత్రం యీ ప్రణాళికకు ప్రాతిపదికగా వుంది. యీ దేశాన్ని బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, జపాన్, చైనా, మెక్సికో, స్వీడన్, నార్వే, డెన్మార్క్, ఆస్ట్రియా, గ్రీస్‌లు గుర్తించిన రెండు సంవత్సరాల కాలంలో ఆయన కార్య కలాపాలు తారా స్థాయికి చేరుకున్నాయి.

ఛిచెరిన్ పనిచేసే పద్ధతి యెవరికైనా ఆశ్చ ర్యాన్ని కలిగిస్తుంది. ఆత్మ త్యాగానికి యెప్పుడూ సిద్ధంగా వుండే విప్లవకారుని లాంటిది ఆయన జీవితం. ఆయన రేయింబవళ్ళు పనిలోనిమగ్నమై వుండేవాడు. ఆయన కింద పనిచేసే వాళ్లు కూడా అదేవిధమైన పనికి అలవాటు పడ్డారు. అలాంటి వారిలో విప్లవ తొలి సంవత్సరాల్లో ఆయనకు యేకైక డిప్యూటీ గా వున్న లెవ్ కారఖాన్ ఒకరు.

పియానోను వాయించినప్పుడే పనినుండి ఆయన దృష్టి మళ్లేది. తరచు ఆయన పియానో వాయించేవాడు. మంచి వార్త తన కార్యాలయానికి అందినప్పుడల్లా ఆయన పియానో వద్దకు వెళ్లేవాడు. సోవియట్ భూ భాగాన్ని జపాన్ సైన్యాలు వదిలి వెళ్లాయని 1922 నవంబరు రాత్రి వార్త అందినపుడు జరిగినదిదే.

"భవిష్యత్తునుండే మానవుడు వచ్చాడు"

అనే నానుడి నిజమైతే అది ముఖ్యంగా ఛిచెరిన్ కేవర్తిస్తుంది. పునరుజ్జీవనకాలం నాటి వుత్తమోత్తములు కలలుగన్న సామరస్యం ఆయనలో వుంది. లియొనార్డో, రఫాయెల్ మైఖెలాంగెలోలు ఊహించిన రేవటి మానవుని ఆదర్శానికి ఆయన మూర్తీభావ మని నా అభిప్రాయం. ఛిచెరిన్ సమరసంగా అభివృద్ధి చెందిన బుద్ధిజీవి. ఆయనకు చరిత్ర, సాహిత్యం, సంగీతం, రష్యన్, విదేశీ కళలపై మంచి పట్టువుంది. ఆయనకు అనేక యూరోపియన్ భాషలు, కొన్ని ప్రాచ్య భాషలతో మంచి పరిచయముంది. నైతిక అర్హతలు బౌద్ధిక అర్హతలు సమరసంగా మిళితమై వున్న వ్యక్తి ఆయన-ఆయన నిజంగా భవిష్యత్తు నుండి మన వద్దకు వచ్చిన వ్యక్తి, మొత్తం జీవితాన్ని విప్లవానికి అంకితం చేశాడు. పరిశుద్ధ జీవన విధానాన్ని అవలంభించిన ఛిచెరిన్ తన పూర్వీకులనుండి సంక్రమించిన అపార సంపదను ఐచ్ఛికంగా విప్లవానికి యిచ్చివేశాడు.

లెనిన్ మరణాంతరం దేశనాయకత్వాన్ని స్వీకరించిన కొందరి గుణగణాలు ఛిచెరిన్ గుణగణాలకు పూర్తి భిన్నమైనవి. సోవియట్ దౌత్య సేవల్లోని ముఖ్యమైన స్థానం నుండి ఛిచెరిన్‌ను తొలగించడానికి నిశ్చయించుకున్న వారి గుణగణాలని నా అభిప్రాయం. 1920 ల మధ్య కాలంలో యీ ధోరణి నానాటికీ కొట్ట వచ్చినట్టు కనిపించింది.

ఛిచెరిన్ తన పదవినుండి విరమించుకున్న తర్వాత, ఆయన మద్ధతుదార్లు, బృందసభ్యులు చాలామంది తమ తమ పదవుల్లో కొనసాగారు. పనినుండి మొరటుగా తీసివేసే ఒక ప్రత్యేక రిటైర్‌మెంటు పద్ధతిని వారికోసం కనుగొన్నారు. విప్లవంనుండి దౌత్యసేవల్లో ప్రవేశించిన బి.స్టెయిన్, ఎస్. అరాలవ్. వై. సురిత్స్ యితర అనేక రాయబారులకు యిది వర్తింపజేశారు. వాస్తవంలో ఎ. లునాఛార్‌స్కీని కూడా పదవి నుండి తొలగించారు—ఆయనకు రాయబారి హోదా యిచ్చారు, కాని తన బాధ్యతలను స్వీకరించకముందే ఆయన ఫ్రాన్స్‌లో చని పోయాడు. క్రియాశీల జీవితం నుండి ప్రజలను తొలగించడానికి యితర పద్ధతులను కూడా వినియోగించారు. యీ విధంగా, సరియైన పనితప్ప యితర పనులన్నిటిలో నిమగ్నమయ్యే కౌన్సిలర్ల వ్యవస్థను సృష్టించారు.

ఛిచెరిన్‌కు చెందినవారిని పెద్దయెత్తున తొలగించడం ప్రమాదకర స్థాయిని సంతరించు కొనసాగింది. యిది దౌత్యసిబ్బందికి వ్యతిరేకంగా ప్రారంభించిన చర్యలకు నాంది మాత్రమే. ఛిచెరిన్ మరణించిన ఒక సంవత్సరం తర్వాత లెవ్ కారఖాన్‌నీ అరెస్టుచేసి మరణ శిక్ష విధించారు. ఛిచెరిన్‌కు విప్లవంతొలి సంవత్స రాల్లో మొట్టమొదటి, కొంతకాలంపాటు యేకైక డిప్యూటీగా లెవ్‌కారఖాన్ వున్నారని యిదివరకే తెలిపాను. తర్వాత ఛిచెరిన్‌కు చాలామంది డిప్యూటీలుగా నియమితు లయ్యారు. కాని కారఖాన్ లాగా సాఫీగా, మైత్రీపూర్వకంగా మరెవరూ ఆయనతో పని చేయలెదు. ప్రజలతో సంబంధాలు పెట్టు కోవడంలో కారఖాన్ తన నిజమైన ప్రతిభను కనబర్చారు. హైర్రియట్, కెమాల్ ఆటా టర్క్, సన్‌యట్‌సెన్ లాంటి ప్రముఖ విదేశీ నాయకులను మనదేశం ఆకర్షించేట్టు చేసిన ఘనత చాలా వరకు ఆయనకే దక్కుతుంది.

మరో వుదాహరణ, మన విప్లవంతోపాటు, ఎదిగిన మన రాజకీయవేత్తల బృందానికి చెందిన వారిలో ఎన్. క్రెస్తిన్‌స్కీ ఒకరు. ఆయన ముఖ్యమైన దౌత్యపదవులను నిర్వ హించారు. అరెస్టు చేసి, మరణశిక్షకు గురి చేయబడిన సోవియట్ దౌత్యవేత్తల మొదటి బృందంలో క్రెస్తిన్‌స్కీ ఒకరు.

ఛిచెరిన్ ఆలోచనల్లోకి తరచుగా వచ్చే ఒక సత్యాన్ని గురించి నేను మరోసారిగుర్తు చేస్తాను. దాని సారాంశమిది: ఛిచెరిన్ బృందానికి నాయకత్వం వహించడం సులభమే, కాని వారిని గెచ్చగొట్టటం యెవరితరమూ కాదు— వారు విప్లవంవైపు తమ సొంత యిచ్ఛతోనే వచ్చారు. కష్టతరమైన కర్తవ్యాన్ని నెరవేర్చడమే తమ బాధ్యతగా పరిగణించారు.

(ప్రావ్దా పత్రిక నుండి)

# బెర్ముడా త్రిభుజ రహస్యాన్ని భేదించే ప్రయత్నం

వి. ఫొమెంకో
క్యాండిడేట్ ఆఫ్ టెక్నాలజీ

*అట్లాంటిక్‌లోని బెర్ముడా దీవులవద్ద విమానాలు, నౌకలు పాటి సిబ్బందితోసహా విచిత్ర పరిస్థితుల్లో కనపడకుండా పోతున్న ఘటనల గురించి సొవెత్స్కాయా ఒబొజ్రెనీ 1988 సంవత్సరపు తన 10వ సంచికలో రాసింది.*

*దీనికి సంబంధించిన అనేక కారణాలను విజ్ఞానశాస్త్రవేత్తలు, పాత్రికేయులు తమ తమ దృక్కోణాలనుండి వివరించారు — వ్యతిరేక గురుత్వక్షేత్రం, జలగర్భంలోని భూకంపాలు, తుఫానులు, అట్లాంటిస్ "మృత్యుకిరణాలు", "కృష్ణబిలాలు", ఐంద్రజాలికులు అని కూడా చెప్పారు. 1975లో అందరికీ తెలిసిన 53 దుర్ఘటనలను వివరించడానికి అమెరికన్ లారెన్స్‌కుశ్చే ప్రచురించిన తన పుస్తకంలో 16 పరికల్పనలను ప్రతిపాదించారు.*

*బెర్ముడా దుర్ఘటనలకు కారణమేమిటో వూహించిన తర్వాతి రచయిత వి. ఫొమెంకో. ఆయన పరికల్పన యిదీ.*

బెర్ముడా దుర్ఘటనలు పైన తెల్పిన కారణాల వల్ల జరగలేదు. యీ దుర్ఘటనలకు కారణం మనకు లోతైన సముద్రగర్భంలో దొరుకుతుంది. మామూలుగా చెప్పే కారణాలను అలా వక్కనబెట్టి సముద్ర ప్రవాహాల ను గురించి ఆలోచిద్దాం.

ధృవసముద్రాల్లో మంచు రూపుగొనే సమయంలో సముద్ర ఉపరితల నీటిపొరలు ఛల్లబడి ఉప్పుతో సంతృప్తమౌతాయి. అప్పుడు ఆ పొరలు బరువెక్కి, నీటిలో మునిగిపో యి, ఉష్ణప్రాంతాలకు తమ ప్రయాణా లను ప్రారంభిస్తాయి. అక్కడ పైకి తేలి సుమారు 187,000 సంవత్సరా ల్లో ఆవిరి అయిపోతాయి. యీ కాలంలో అవి సముద్ర జంతువుల. అవశేషాలనుండి, అవి విసర్జించిన మలమూత్రాల నుండి సూక్ష్మజీవులు వుత్పత్తిచేసే కార్బన్ డై ఆక్సయిడ్‌ను పోగుచేసుకుంటాయి. యీ 187,000 యేళ్ల కాలంలో అలాంటి నీరులో ప్రతి ఒక్క లీటర్‌కు 10.8 గ్రాముల కార్బన్ డై ఆక్సయిడ్ చేరుతుంది. యిది వాతావరణ పీడనంవల్ల నీటిలో పోగయ్యే కార్బన్ డై ఆక్సయిడ్ కన్నా 4.7 రెట్లు యెక్కువ. సముద్ర వుపరి తలానికి 46 మీటర్ల లోతులో వుంటూ యీ అగాధ జలం సోడా నీరు వదిలి నట్టుగానే చిన్నచిన్న బుడగల రూపంలో గ్యాస్‌ను వదులుతుంది. యీ బుడగలు "మరిగే" నీటిసాంద్ర తను తగ్గించి, ఆ నీరు ఉపరితలానికి వెళ్లే వేగాన్ని పెంచుతాయి. యీ నీరు ఉపరితలానికి వెళ్లే సమయానికి అందులో దాని పరిమాణంకన్నా 4.7 రెట్లు గ్యాస్ వుంటుంది. యీ "మరి గే" ద్రవం సాంద్రత 0.175 గ్రా/ఘ.మి. కు వడిపోతుంది. అప్పు డు నీటి ఉపరితలం 99 మీటర్ల కొండంత యెత్తుకు పొంగుతుంది.

నౌక ప్రయాణిస్తున్నపుడు జలగర్భ "అగ్నిపర్వతం" వ్యవస్థ (దీన్ని నేను పోసిడెన్ దేవత అంటాను) బద్దలు కావడానికి పురిగొల్పేదేమిటి? దీనికి సమాధాన మివ్వడానికి ప్రయత్నిస్తా ను.

1971లో సింధుశాఖ వేడి నీటి ప్రవాహంలో సంవృత వర్తులాలు యేర్పడినట్టు చూశాం. అవి అప్పుడప్పుడు సముద్రంలోకి ప్రయాణం సాగించాయి. బెర్ముడా త్రిభుజంలో నైతే యీ వర్తులాల వ్యాసము సుమారు 200 కి.మీ; లోతు సుమారు 3 కిలో మీటర్లు, ఎగువ పొరల్లో దీని పరిధి వేగం 2 మీ/సెకను వుంటుంది. యీ వర్తులాల కదలిక టొరాయిడ్‌లాంటి పార్శ్వీయ సుడులను సృష్టిస్తుంది. యీ సుడులు వేడి ఉపరితల పొరను పల్చగాచేసి సముద్రగర్భజలాన్ని వర్తులాల కేంద్రంలోకి నెట్టి వాటికి గుమ్మటం ఆకారాన్ని సమకూర్చుతా యి. యిక్కడ ఉపరితల నీటి ఉష్ణం 10-12 సెల్సియస్‌కు పడిపోతుంది.

ఈ విధంగా కార్బన్ డై ఆక్స యిడ్‌తో సంతృప్తమైన సముద్రజలం వర్తులాలనుండి పైకి గుమ్మటమంత ఎత్తు ఎగుస్తుంది. ఆ నీరు ఓడ చట్రములోకి, ప్రొపెల్లర్‌లోకి ప్రవేశించి, దాన్ని కుదుపులకు గురిచేసి, స్థానిక "మరుగుదలను" సృష్టించి, సముద్రగర్భజలాన్ని పైకి ఎగిసేట్టు చేస్తుంది. తక్కువ సాంద్రతగల జలంలో చిక్కుకున్న ఓడ, రెప్పపాటులో మునిగిపోయి వెంటిలేటర్ల గుండా దానిలో నీరు ప్రవహిస్తుంది.

తలుపులను, కిటికీలను గట్టిగా మూసివేస్తే ఆ నౌక మరుగుదల లేనటువంటి డజన్ల మీటర్ల లోతుకు మునిగిపోతుంది. అక్కడ ప్రతి చదరపు మీటరుకు కొన్ని డజన్ల టన్నుల వత్తిడి వుంటుంది కాబట్టి ఓడ మొత్తం తునాతునకలైపోతుంది.

గుమ్మటం శిఖరానికీ, నీరు మరగటం ప్రారంభమయ్యే ప్రాంతానికీ కొన్నిమీటర్ల దూరం మాత్రమే వున్న పక్షంలో, అక్కడి నీరులో కార్బన్ డై ఆక్సైడ్ పరిమాణం తక్కువ వుంటుంది కాబట్టి ఓడ చాలా లోతుకు వెళ్లిపోదు. కాని ప్రయాణీకు



లు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై ఓడనుండి పోసిడెన్ నోట్లోకి దూకుతారు. మరి అలాంటి పరిస్థితుల్లో జంతువులెలా బతుకుతున్నాయి? యెందుకంటే అవి ప్రయాణీకుల లాగా బయటికి దూకకుండా కాబిన్లలో తలదాచుకుంటాయి.

శాంతించిన పాసిడెన్ చల్లబడుతుంది. స్వయం వినాశక యంత్రాంగంవల్ల దాని ఆగ్రహం చాలాసేపు వుండదు. గ్యాస్ లేకుండా పోయి పోగుపడిన నీరు, ప్రతిచర్యల పరంపరను నిలిపివేసి, పాసిడెన్ బద్దలు కాకుండా శాంతపరుస్తుంది.

నౌకలు మాత్రమే పాసిడెన్‌ను మేల్కొల్పవు. ఒక పెద్ద అలగానీ, పొంగుగానీ గుమ్మటం మీదుగా వెళ్లినప్పుడు కూడా యిదే జరుగుతుంది. అలాంటప్పుడు పాసిడెన్ కొండ ఆకారంలో గాక కట్టలాగ ఉంటుంది.

మామూలు తుఫాను కూడ ఈ ప్రేలుడును సృష్టించ వచ్చు. అప్పుడు సమీపంలోని ఓడ వెంటనే ధ్వంసమై పోతుంది.

ఉష్ణమండల తుఫానులు కూడా పోసిడెన్‌ను రెచ్చ గొట్టవచ్చు. 100 నుండి 300 కిలో మీటర్ల వ్యా సంగల శక్తివంతమైన తుఫాను, 10 మీ/సెకను వేగంతో నీటిని గుండ్రంగా తిప్పి ఒకగుమ్మటం ఆకారాన్ని సృష్టిస్తుంది.

1952లో మ్యోజిన్స్‌‌ఛో ప్రేలుడు జపాన్ పరిశోధన నౌకను ముంచివేసింది. సముద్రగర్భంలోని పగుళ్ల నుండి విడుదలయ్యే మాములు మిథేన్ వల్లకూడా యిలాంటి విషాద ఘటనలు జరుగుతాయి. నీటిలో కార్బన్ డై ఆక్సైడ్ కన్నా మిథేన్ 27 రెట్లు తక్కువ కరుగుతుంది. కాని అధికపీడన పరిస్థితుల్లో మిథేన్ మామూలుకన్నా ఎక్కువ కరుగుతుంది. అది ప్రేలుడు సృష్టించడానికి సరిపోతుంది. యిలాంటి సందర్భాల్లో "మరుగుదలలు" రెండుదశల్లో సంభవిస్తాయి: మొదట మిథేన్, తర్వాత నురగ పైకి ఎగసి కార్బన్

డై ఆక్సైడ్ మరుగుతుంది.

పొసిడెన్ బ్రద్దలైనపుడు సము ద్రంపైగల గాలిలో ఏం జరుగు తుంది? ముమ్మరంగా వ్యాపించే కార్బన్ డై ఆక్సయిడ్ పైకివెళ్లి నమీ వంలోని గాలిపొరలను చల్లబ రుస్తుంది. దాంతో కిందివైపుగా గాలిచాలా వేగంతో వీస్తుంది యిలాంటి గాలి అమెరికాలో 1964-1984 కాలంలో 27 విమానాలను కిందికి లాగి ధ్వంసం చేసింది. వాతా వరణాన్ని పొసిడెన్ మరింత అస్థిరప ర్చి, విమానం రెక్కలు విరిగిపోయేట్టు, యింధనంలో మంటలు చెలరేగేట్టు చేస్తుంది.

పొసిడెన్ పైగా. వెళ్లే విమానం మిథేన్ అరలో ప్రవేశించి అందులో మండిపోవీలుంది. కార్బన్ డై ఆక్స యిడ్ అరలో అది ప్రవేశిస్తే ఇంజన్ అకస్మాత్తుగా ఆగి పోతుంది, లేదా మంటలు చెలరేగవచ్చు. అలాంటి నమయాల్లో ప్రమాదసంకేతాలు పంపేందుకు. కూడా వీలులేనంత త్వరగా మరిగే సముద్రంలో అది కూలిపోతుంది. 1948 లో లండన్ నుండి బెర్ముడాకు బయలుదేరిన నాలుగింజన్ల స్టార్ టైగర్‌కు కలిగిన ప్రమాదం బహుశ ఇలాంటిదే కావచ్చు.

బెర్ముడా రహస్యానికి సంబంధించిన యీ నూతన పరికల్ప నను నమ్మడం లేదా నమ్మకపోవడం అంతా మీయిష్టమే. అయితే నేను కాలక్షేపంకోసం యిదంతా చెప్పలేదు: విమానాలను, ఓడలను అట్లాంటిక్ మింగేస్తూనేవుంది. యీ పరికల్పనను పరీక్షించి ఆమోదించడమో, తోసిపు చ్చడమో యేదో ఒకటి చేయాలి. యీ పరికల్పనే నిజమనిరుజువైతే ప్రమా దకరమైన ప్రాంతాలను కనుగొన వచ్చు.

[ప్రిరోడా ఇ చెలోవెక్ (ప్రకృతి, మానవుడు) అనే పత్రికనుండి]



# కాలంతో కలిసి నడవడం కష్టం

యూరి నగీబిన్‌తో 'ప్రావ్దా' ఇంటర్వ్యూ

ప్రశ్న: ఈ రోజులు "సంపూర్ణమయిన లొంగుబాటు" దినాలని చాలామంది అభివర్ణిస్తున్నారు. "తెలివయిన లొంగుబాటుదారుగా మెలిగితే పైకొస్తావు" అన్నదే ఈకాలపు మహదాశయంగా వాళ్లు చెబుతున్నారు. మీరేమంటారు?

జవాబు: సంపూర్ణమయిన లొంగుబాటు ధోరణి గురించి మాట్లాడడం, అందర్నీ ఒకేగాటన కట్టడం కిందకొస్తుంది. సర్వశక్తిమంతులుగా వెలిసిన అధినాయకులను — స్టాలిన్ కానీండి, కృశ్చేవ్ కానీండి, బ్రెజ్నేవ్ కానీండి, చివరికి ఏ నిశ్చితాభిప్రాయములేని చెర్నెంకోయే కానీండి, ఇలాంటి నేతలను కీర్తించడానికి నిరాకరించి నిలబడినవాళ్లు చాలామంది ఉన్నారు. వాళ్లు పరిస్థితులతో సర్దుకుపోలేదు. ఈ పరిస్థితులు ముందు ముందు మారుతాయని వాళ్లు విశ్వసించారు.

పోతే, లొంగుబాటు ధోరణి గురించి నాకు అర్థమయినంత వరకు—సూత్రపాయంగా రెండు ముక్కలు చెబుతాను. బతికి బట్టకట్టేందుకూ, నీ కుటుంబ సభ్యుల్ని కాపాడుకునేందుకూ ఏదన్నా దయారహితమయిన దుష్ట శక్తికి తలవంచడం ఒకరకం. నీ వీపు చిట్లగొడితే, నువ్వు లొంగిపోతావు. అవునుమరి — ప్రజలందరూ కూడా యోధాన యోధులు కారుకదా! 'యోధులు కొరవడినదేశం పరిస్థితి దయనీయం' అన్నారు బెర్తోల్ బ్రెక్టు. మనదేశంలో అందరూ యోధులే. రైతు, ప్లంబర్, డెంటిస్టూ అంతా ఒకేశ్రేణి. మామూలు పనికి



సయితం గొప్ప ధైర్యసాహసాలు అవసరమనే విచిత్రమయిన విశ్వాసం బలసిపోయింది. ఆమాట కొస్తే యుద్ధంలో పాల్గొనే వాళ్లలో కూడా ప్రతి ఒక్కడూ యోధుడు కాబోడు. యోధులు స్వల్ప ప్రమాణంలో ఉండే విశిష్టులు మాత్రమే. భయం, బలహీనత, నిరాశలాంటి పీడల్ననుభవించే సామాన్య ప్రజలే ఆ భావాలను అణగదొక్కుకుని తమ ఘోర కర్తవ్యాన్ని నిర్వర్తించి యుద్ధాల్లో పోరాడుతారు, విజయాలు సాధిస్తారు. విచిత్రమేమిటంటే, ఇతరులందరూ యోధాను యోధులుగా ఉండితీరాలని పట్టు బట్టే పెద్దల్లో చాలామంది పిరికి పందలే అయి ఉంటారు. నిజానికి, ఈ భూగోళాన్ని శాసిస్తున్న మనమందరం ఏదో ఒక మేరకు లొంగుబాటుదార్లుగా వ్యవహరించినవాళ్లమే. అలాచేసి ఉండకపోతే అసలు మానవాళి బతికి బట్టకట్టలేకపోయేది. అయితే ఎవరన్నా ఏ మేరకు తట్టుకు నిలబడగలడు అన్న దానిమీదే అంతా ఆధారపడి ఉంటుంది. చిన్నపాటి వత్తిడికే లొంగిపోయి తన సిద్ధాంతాలనూ, విశ్వాసాలనూ త్యజించేవాడిది, దయనీయమయిన లొంగుబాటు. చిత్రహింసలకు సయితం తట్టుకుని తన సిద్ధాంతాన్ని విశ్వాసాన్ని కొనసాగించేవాడు గెలీలియో అంతటి యోద్ధ! చిరంజీవిగా మారిన ఈ మృతవీరుడి మీద రాళ్లు వేసేందుకు ఎవరన్నా సాహసించగలరా? క్రైస్తవ మతాధికారుల విచారణా సంఘం నుంచి ఎంత వత్తిడివచ్చినా, 'ఏదేమన్నా చెప్పండి—భూమి తిరుగుతూనే ఉంది' అన్నాడు గెలీలియో.

పోతే– ఏ విధమయిన మానసిక హింసా, భౌతికంగాగానీ నైతికంగాగానీ ఏ ఒత్తిడీ లేకుండానే, బలహీనతకు లోబడిపోయి, పైకి పోవాలనే ప్రలోభంలో పడిపోయి దుష్టశక్తులకు ఊడిగం చెయ్యాలని ఎంచుకోవటం వేరేరకం.

**ప్ర: యవ్వన దశలోనే ఎవరన్నా ఈ ధోరణి అలవర్చుకుంటే?**

జ: అది మరీ ఘోరం. స్టాలిన్‌ను కీర్తిస్తూ పద్యం రాసిన మెండెల్‌స్టామ్‌ను - రోగిష్టివాడూ, కష్టాల కడలిలోపడి అలసిపోయిన నిర్భాగ్యుడూ అయినవాణ్ణి ఖండించగలమా? భార్య తదితర బంధువులూ ప్రాధేయపడగా ఆయన అలాంటి పద్యం రాశాడు. అలాంటివాణ్ణి — స్వాప్నికుడూ, పిచ్చివాడూ, కవీ అయిన వ్యక్తిని లొంగుబాటుదారుగా లెక్కించగలమా? అలాగే, అంతులేకుండా సాగుతూ ఉండిన వేధింపుల బాధపడలేక, స్టాలిన్ యవ్వనాన్ని వర్ణిస్తూ ఒక నాటకం రచించిన బుల్గాకవ్ కూడా. లోహం సయితం, స్వాభావికమయిన లక్షణాలు కోల్పోయేంతవరకు మాత్రమే తట్టుకుంటూ ఉంటుంది. మనిషి లోహంతో తయారయిన వాడు కాడే. మెత్తటి, సరళమయిన మాంసంలో సున్నితమయిన నరాలతో తయారయిన వాడు మనిషి. కుర్రవాళ్లు మా పాతతరం మనుమల్ని — భయంకరమయిన కాలం కడలిని ఈదుకొచ్చిన వాళ్లను—చిన్న చూపు చూస్తుంటారు, మా మీద మండిపడుతుంటారు. మేం అనుభవించిన పీడన గురించి తెలీని వాళ్లూ, మేంఅతి బలహీనంగానే అయినా దాన్నిఎదుర్కోడానికి ప్రయత్నించడం గురించి విని ఉండని వాళ్లూ మా మీద రాళ్లు విసరడానికి వీల్లేదు.

**ప్ర: 1960, 1970 లలో పెరిగిన తరం గురించి మీ అభిప్రాయం ఏమిటి?**

జ: ఏ విషయంలోనయినా వాళ్లను నిందించడం భావ్యంకాదు. ప్రతీ విషయం గురించి ద్వంద్వ ముఖాలతో ప్రవర్తించే రీతిలో వాళ్లను పెంచి పెద్దచేశాం. ఇంట్లో ఒకరకంగానూ, స్కూళ్లో, ఆఫీసులో మరోరకంగానూ ఉండే వాళ్లు ఈతరం వాళ్లు. వాళ్ల తల్లితండ్రులు అంతకు పూర్వం భయంకరమయిన అనుభవాలు పొంది ఉండిన కారణంగా, ఈ తరంవాళ్లలో అత్యధికులు ఏ మినహాయింపూ లేకుండానే లొంగుబాటు అనే అలిఖిత శాసనానికి తలవంచేశారు. అత్యధికులతో కలిసి ఉండడమనేది ఒక సుగుణంగా ఈ దేశంలో చెలామణీ అవుతూ వచ్చింది. అయితే అది అత్యంత ప్రాథమికమయిన మంద మనస్తత్వం తప్ప మరొకటి కాదు. ఏమంటారు? మా స్కూల్లో బుఖారిన్‌కు మరణశిక్ష విధించాలని డిమాండ్‌చేస్తూ మేమంతా సమావేశం జరపడం నాకు బాగా గుర్తుంది. భయంతో సగం చచ్చిపోయినా, నేను చెయ్యిమాత్రం ఎత్తలేదు. అయితే ఈ డిమాండుకు అనుకూలంగా చెయ్యెత్తిన ఒక కుర్రాడు నాకేసి అవగాహనాపూర్వకంగా చూసిన చూపుకూడా నాకు గుర్తింది. మేం ఇద్దరం ఒకే ఫుట్‌బాల్ టీములో ఆడేవాళ్లం.

కానీ మేం ఎప్పుడూ స్నేహితులంకాదు. అతను నేను చెయ్యి ఎత్తక పోవడం గురించి ఫిర్యాదు చెప్తాడనిపించింది. కానీ అలాంటిదేం జరగలేదు. అయితే అలాంటి సంఘటనలుకూడా జరిగాయి.

**ప్ర: మీరు సుప్రసిద్ధ రచయితలూ కళాకారుల గురించే ఎక్కువ రాశారు. ఎంచేత?**

జ: సృజనాత్మక వ్యక్తిత్వానికీ ఆనాటి పరిస్థితులకూ మధ్య సంబంధం—ఇంకా స్పష్టంగా చెబితే కళాకారుడికీ ప్రజలకూ మధ్య సంబంధం—నాకు ఆసక్తికరంగా అనిపించేది. మనం ఒక సూత్రాన్ని జీర్ణంచేసుకున్నాం. కళాకారుడు జాతికి ఋణపడి ఉన్నాడు అన్నదే ఆ సూత్రం. అది చాలావరకూ నిజమేకానీ, మన ముందు నిజాయితీతో, నమ్మకంతో తమ హృదయాలను విప్పిచెబుతున్నవాళ్లకు మన జాతి ఏమీ ఋణపడిలేదా? అవగాహనాలోపంవల్లా, గుర్తింపు లేకపోవడంచేతా, సమకాలికుల అంధత్వం కారణంగా ఎందరు మహామేధావులు వేధింపులకు గురయ్యారో ఒక్కసారి ఆలోచించుకోండి. రెంబ్రాంట్, బాక్, మ్యాబర్ట్, స్టెండహాల్ (ఇతగాడి అంత్యక్రియలకు ఒకే ఒక్క వ్యక్తి మహా రచయిత బాల్జాక్ హాజరయ్యాడు), లెస్కోవ్, రఖ్మనినోవ్, జాయిస్, కాఫ్కా, వాన్‌గాఫ్, సిజానే - వీళ్లందరూ ఆవిధంగా బాధలుపడినవాళ్లే. నిజానికీ జాబితా ఇంకా చాలా పెద్దగా ఉండాలి. అంచేత నేను కళాకారుల దుఃఖంమీద ప్రధానంగా కేంద్రీకరించి, కథలూ, నవలికలూ రాయడం ప్రారంభించాను. వాటిల్లో చారిత్రక సత్యం కల్పనతో కలగలిసి ఉంటుంది.

అయితే గుర్తింపు లేకపోవడం అనే ఒక్కదాన్ని గురించే నేనేమీ రాయలేకపోయాను. పద్యాలు ఎలా పుట్టుకొస్తాయి? దీన్ని గురించి ఆలోచించి, నేను "త్యుత్చేవ్ గురించిన ఒక స్వప్నం" అనే కథ రాశాను. అమాయకుడయిన ఒక పసిబిడ్డ హృదయంలో ప్రతిభ ఎంత విచిత్రంగా ప్రవేశిస్తుంది. దీని గురించిన ఆలోచనలే "సాహిత్యం మాష్టారు" కథగా రాశాను. ఇది బూనిన్ బాల్యానికి సంబంధించిన కథ. తిరుగుబాటు దారూ, మతబోధకుడూ అయిన రైతు అవ్వాకుమ్ మహత్తరమయిన మన రష్యన్ వచనానికి పితృపాదుడని నాకు ఒకసారనిపించింది. దాన్నే నేను "వీర పూజారి" అనే కథగా రాశాను. అలాగే, ఒకసారి ప్రసిద్ధ ఒపెరా సమ్మేళనకర్త ఇమ్రెకల్మాన్ జీవితంలోని విషాదం నన్ను కదిలించింది. సుఖమంటే ఏమిటో ఎరగని అతని జీవిత కథనే "ఒపెరెటా" కథగా రాశాను. అయితే ఇప్పుడు నన్ను వర్తమానం ప్రేరేపిస్తున్నంతగా మరేదీ ప్రేరేపించడంలేదు. అంచేత గతాన్ని కథావస్తువుగా తీసుకుని ఇకపై రాయలేనేమో అనిపిస్తోంది.

**ప్ర: మీరో కథలో ఓ ముక్క చెప్పారు. "కాలంతో కలిసి నడవడమే జీవితం" అన్న మీ వాక్యం మీకు సంబంధించి ఏమర్థమిస్తుంది?**

జ: వాస్తవం వెల్లడయినప్పుడు - అది ఎంతచేదు నిజమయినప్పటికీ కూడా - నీ నమ్మకాలను పునర్విమర్శచేసుకునే సామర్థ్యం ఉందే, అది చాలా అవసరం. శిశువులు కాబేజీలో దొరకరని పిల్లలకు తెలిసిపోయినప్పుడు, తమ తల్లిదండ్రులు పైకి కనిపించేంత హాయిగా లేరని అర్థమయినప్పుడు, ఆ పసివాళ్ల ప్రపంచం తల్లకిందులు అయిపోతుంది. పుట్టుకకు సంబంధించిన పరమ రహస్యం తెలియడం అనేక మందిని అనేక రకాలుగా ప్రభావితం చేస్తుంది. కొందరు అశ్లీల ప్రపంచంలో విహారాలు మొదలుపెట్టి మరుగుదొడ్ల గోడల మీద, చర్చిల ద్వారాలమీద బూతుముక్కలు రాయడం మొదలుపెడతారు. మరికొందరు ఈ నిజం నుంచి వికర్షితులవుతారు. ఇంకొందరిమీద దాని ప్రభావం మరీ తీవ్రంగా ఉంటుంది. వాళ్లలో అనూహ్యమయిన ధోరణులు - లైంగిక పెడధోరణులూ, లేదా తీవ్రమయిన విముఖత తలెత్తవచ్చు. అయితే ఇతరులు దీన్ని సామాన్యంగా తీసుకుని, అర్థంచేసుకుని ఆమోదించవచ్చు.

ఈ విషయాన్ని ఇంకో కోణం నుంచి పరిశీలించి చూద్దాం. నీలో నాకు నిరాశ కలిగించే అంశమేదో - ఉదాహరణకు, నువ్వు ఊహించుకున్నంత ధైర్యశాలివి కాదన్న వాస్తవం - తెలిసి వచ్చిందనుకో. అంతమాత్రాన కంగారుపడి కాళ్లు తొక్కేసుకోవద్దు. నాలుగో హెన్రీ చక్రవర్తిలాగా నీ బలహీనతను అధిగమించేందుకు యత్నించు. హెన్రీ చక్రవర్తి అచ్చమయిన

పిరికిపంద. కానీ ప్రతిసారీ "పిరికినన్నాసీ ముందడుగు వెయ్యి, పందా, పద ముందుకు" అని తనకుతానే చెప్పుకుంటూ ఎన్నో నగరాలను గెల్చుకుంటూ పోయాడు. అలాగే నీ స్నేహితుడు పరమ స్వార్థపరుడనో, నీ గురించి అణుమాత్రం పట్టించుకోని దౌర్భాగ్యుడనో తెలిసినప్పుడుకూడా నీకు విప రీతమయిన అసంతృప్తి కలుగుతుంది. అయినా సరే, నీ స్నేహాన్ని నిలబెట్టు కోవాలి. దాన్ని యధాతథంగా జీర్ణించుకోవాలి. అంటే కొత్త విషయాన్ని కనిపెట్టడం అనేది నిన్ను దిగజార్చ కూడదు - నీకు అవమానకరంగా మారకూడదు. ఆ విషయానికి అనుగుణంగా సర్దుకుపోడానికీ యత్నించు. సంక్లిష్టమయిన మన జీవితాన్ని మరింత మెరుగ్గా అర్థంచేసుకుంటూ ముందుకు పోవాలి.

గత విశ్వాసాల గురించి చెప్పుకుంటే, వ్యక్తిత్వ వికాసాన్ని పరిమితం చేసే పరిమితులను గురించి ఆలోచించకుండా ఉండలేవు. ఈ పరిమితులు యువకుల్లో వృద్ధుల్లో ఒక్కొ క్కళ్లలో ఒక్కో రకంగా ఉంటాయి. అయితే లేవ్ టాల్‌స్టాయ్, తాత్వికుడు లెసోవ్‌లాంటి వాళ్లలో మృత్యువు మాత్రమే వ్యక్తిత్వ వికాసాన్ని పరిమితం చెయ్యగలిగింది. ఈ ఆంతరంగిక ఘర్షణ తీవ్రతరమయ్యే కొద్దీ నీ భ్రమలను నువ్వు బద్దలు చేసుకోగలుగుతావు. అయితే తన సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించుకో కుండానే ఎవరన్నా స్తంభించిపోతే కనక, అతగాడు పరిస్థితులకు పూర్తిగా లొంగిపోయాడని అర్థం. అతగాడు ఆత్మద్రోహానికి తలపడ్డాడన్నమాట. స్టాలిన్‌ను చిత్తశుద్ధితో ఆరాధించిన వాళ్లను నేను అర్థంచేసుకోగలను. హఠాత్తుగా స్టాలిన్ చేసిన నేరాల తాలూకు వాస్తవాలూ, ఆ నియంత చేతిలో హతమారి పోయిన లక్షలాది మంది అమాయక ప్రజల గురించిన చేదు నిజాలు వెల్లడవుతాయనుకో - వాళ్లేం చెయ్యాలి? అలాంటప్పుడు, ఈ స్టాలిన్ అభిమానులు గుండెలు చిక్కబట్టుకుని చేదునిజాన్ని దిగమింగి బతకాలి. ఇది నా అభిప్రాయం. అయితే అనేకమంది అలా చెయ్యలేరు. వాళ్లవి సుఖాలకు దూరమయిన విషాదకరమయిన జీవితాలు: ప్రసిద్ధ కవి అలెక్సాండ్ర్ త్వార్దవ్‌స్కియ్ భ్రమలన్నీ బద్ధలయినప్పుడు పడ్డ ఆవేదనను నేను కళ్లారా చూశాను. ఆయన స్టాలిన్‌ను నమ్మాడు. అతగాణ్ణి కీర్తిస్తూ పద్యాలు రాసి అంకితాలుకూడా చేశాడు. స్టాలిన్ కార్యకలాపాలను "విప్లవంతాలూకు ఉక్కు ప్రస్థానం" గా త్వార్దవ్‌స్కియ్ అభివర్ణించాడు. మనం వెర్రిదద్దమ్మలమనీ మంచీ చెడులన్నింటినీ నమ్మేసే చవటాయలమనీ అంధత్వంతో కళ్లు మూసుకుపోయినవాళ్లమనీ అంగీకరించడం ఎవరికైనా కష్టమే. అందులో త్వార్దవ్‌స్కియ్‌కి - దృఢమయిన వ్యక్తిత్వం కలిగి ఉండి వాస్తవంపట్ల గట్టి విశ్వాసం కలిగి ఉన్న కవికి - మరీ కష్టం. కానీ ఆయన ఆ కష్టకార్యం సాధించలిగిగాడు. తన పాతకాలపు భ్రమలు వదిలించుకున్నాడు. ఆటుతర్వాత ఆయన సాగించిన జీవితమూ, "నవీయ్‌మీర్" పత్రికద్వారా ఆయన చేసిన కృషీ - అదంతా పరిహారం లాంటిది. అందుకని, ఆయన్ను మనం గౌరవించాల్సి ఉంది.

**ప్ర: అతి స్పష్టమూ, అతి సరళమూ అయిన నిజాలను ప్రజలకు తెలియజెయ్యడం అత్యంత కఠినమయిన పని అంటూ రాశారు మీరు. రచయితలు చేసే పని అదేనని నా అభిప్రాయం. ఈ కష్టసాధ్యమయిన పనిని వాళ్లు ఎలా చేస్తారంటారు?**

జ: రచయితలు కొన్ని సందర్భాల్లో ఈ కర్తవ్యం నిర్వర్తించరు. పాఠకుడు వాస్తవాన్ని అర్థంచేసుకోడానికి రచయిత తోడ్పడతాడు. నేను చెబుతున్నది ఇదే కర్తవ్యం కోసం జన్మెత్తిన రచయిత గురించి - కాలక్షేపం బఠాణీ గ్రంథకర్తల గురించి కాదు. మనిషి ఎలా ఉండాలో, అలా ఉండేలా చేసేందుకు రచయిత కృషి చెయ్యాలి. తనంత తాను ఎన్నో కష్టనష్టాలు అనుభవించిన వ్యక్తిమాత్రమే ఏదన్నా సలహాయో, సూచనో ఇవ్వగలుగుతాడు. అంతేతప్ప అత్యాశలూ ఆడంబరాలూ చక్కని పదాలను ఎంపిక చేసుకోగల సామర్థ్యం - ఇవి ఎందుకూ పనికిరావు. వయసు పెరిగేకొద్దీ నీ కృషి తాలూకు మంచి చెడ్డల పట్ల మరింత విమర్శనాత్మకంగా ఆలోచించ గలుగుతావు. ఏదో కాగితంమీద నీ అభిప్రాయాలు కాస్తా కక్కేయాలన్న తాపత్రయం పోతుంది.

ఒక్కమాట - పరమ నీచుడు ఎవడూ మహారచయిత కాలేదు. సాహిత్య ప్రపంచంలో జెండా ఎగరేయగలడేమోగానీ మహా రచయిత కాలేడు. సాహిత్య ప్రతిభకు ఒకే ఒక్క ప్రమాణం ప్రజలపట్ల ప్రేమ కలిగి ఉండడమేనని అనతోల్ ఫ్రాన్స్ అన్నాడు. అది తిరుగులేని వాస్తవం.

# పురావస్తు శాస్త్రం

తామన్ ద్వీపకల్పంలో యిటీవల సోవియట్ పురావస్తు శాస్త్రవేత్తలు గావించిన ఆవిష్కరణలు సంచలనాత్మకమైనవి. క్రీ.పూ. ఒకటో శతాబ్దం నాటి ఈ పురావస్తు సముదాయపు శిథిలాల్లో అనేక ప్రాచీన కళాఖండాలు, అద్భుతమైన శిల్పాలు లభించాయి. యీ శిల్పాలు యెంతో ఆసక్తిని, యెన్నో ప్రశ్నలను రేకెత్తించాయి. వీటిని ఎవరు, ఎప్పుడు, ఎందుకు సృష్టించారు? ప్రాచీన కాలంలో యీ ద్వీపకల్పంలో నివసించిన వారెవరు? వారి సంస్కృతి ఏమిటి?

---

వలేరి క్లియోనవ్

# ప్రాచీన సింధికా



ఉపశిల్పం "యుద్ధం"

క్రాస్నొదార్ మండలంలోని పొంతాలవస్కీ ద్వీపకల్పంలో ఒక ఖండ్రికను ద్రాక్షతోటవేయ డానికి 1982 ఆకురాలు కాలంలో రైతులు **దున్నుతుండగా 1.5 మీటర్ల పొడవుగల** శిల్పం చెక్కి వున్న ఒక రాతి దిమ్మె దొరికింది. దానిపై నగ్నంగా చిత్రించిన యువకుని బొమ్మ వుంది. యిది క్రీ.పూ 4 వ శతాబ్దపు చివరినాటి స్మశాన ఫలకమనీ, అజ్ఞాత శిల్పి చెక్కిన యీ శిల్పం అట్టిక్ కళా సాంప్రదాయానికి చెందిన **దనీ నిపుణులు అభిప్రాయపడ్డారు.**

నదిని దాటి సిమ్మెరియస్‌కు చేరుకుని అక్క డున్న సిమ్మెరియన్లను ఆసియాకు తరిమివే శారని, "చరిత్ర పితామహుడు" హెరొడోటస్ రాశాడు. యిది దాదాపు క్రీ.పూ. 720 లో **జరిగిన ఘటన. యీ సిమ్మెరియన్లు ఇండో-ఆ** ర్యన్ తెగల సంతతి వారని కొందరు చరిత్ర కారుల అభిప్రాయం. యీ తెగలే యిక్కడి నుండి క్రీ.పూ. 3 వ సహస్రాబ్దిలో యూరేసియా గుండా పెద్ద యెత్తున వలసవెళ్లాయి. ఆనాటి **ప్రాచీన ఇండో-యూరపియన్ సంస్కృతుల**

# చరిత్ర

ఆ తర్వాత వేసవిలో మాస్కోలోని పుష్కిన్ ఫైన్ ఆర్ట్స్ మ్యూజియంవారు అక్కడ ఒక క్రమపద్ధతిప్రకారం తవ్వకాలు జరిపారు. వారికి సున్నపురాతి బొమ్మల విరిగిన ముక్కలు, క్రీ.పూ. ఒకటవ శతాబ్ది నాటి ఒక చిన్న పెరటియింటి శిధిలాలు లభించాయి. దర్బారు హాలు నుండి భవనంలోకి వెళ్లడానికి మెట్టుగా వినియోగించిన శిలఒకటి దొరికింది. యిది 26 వందల యేళ్ల నాటిదైనప్పటికీ దీనిపై చెక్కిన బొమ్మలు చెక్కుచెదరలేదు. సింహాల **తలలతో అలంకరించబడిన, కెర్చ్ సున్నపు రాయితో చేసిన స్తంభాల, మంటపాల, గొట్టాల** భాగాలు దొరికాయి. యివి క్రీ.పూ. నాల్గోశతాబ్దం చివరి, మూడో శతాబ్దం ప్రారంభం నాటికాలానికి **చెందినవని వై. నవోస్తినా (క్యాండిడేట్ ఆఫ్** హిస్టరీ) అభిప్రాయపడ్డారు.

**మొట్టమొదటి గ్రీకు వలసలు కెర్చ్‌జల** సంధి తీరాన క్రీ.పూ. 6 వ శతాబ్దకాలంలో నెలకొన్నాయి. అయితే యీ మండలచరిత్రకు నాందివాచకం పలికింది వీరేకాదు. యీ మండలాన్ని సిధియన్‌రాజు అగేథస్ నుండి మస్సాగెట్స్ గెలుచుకోగా సిధియన్లు దాన్

జాడలు నల్లసముద్ర ఉత్తరతీరంలో, క్రిమి యాలో, ఉత్తర కాకసస్, తామన్ ద్వీపకల్ప ఉత్తర ప్రాంతంలో కనిపిస్తున్నాయి. 'బహుశ **ఆ సంస్కృతికి ఆద్యులైన వారిలో సిమ్మెరియ న్లు కూడా ఒకరు కావచ్చు.."యీ నాడుకూడా సిధియాలో**'సిమ్మెరియన్ దుర్గాలు **వంతెనలు వున్నాయి సిమ్మెరియన్ అనే ప్రాంతం, బోస్పొరస్ సిమ్మెరియన్ అనే ప్రాంతం"** వున్నాయని క్రీ.పూ. 5వ శతాబ్దంలో హెరొడోటస్ **రాశాడు. కెర్చ్‌జల సంధి తీరాల్లో యిప్పుడు** కూడా వాటి శిధిలాలున్నాయి. సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడైన ఒ.త్రుబాచెవ్ అభిప్రాయమిది:

బాల్కన్ ద్వీపకల్పంలోని త్రాసియన్లు, క్రిమి యన్ **తాతార్లు**, ద్నీప్ దిగువఒడ్డునగల ప్రజలు, సిందు, మియోతుతెగలు, తామన్ ద్వీపకల్ప ప్రజలు, దాన్ని ఆనుకునివున్న ప్రాంతాల ప్రజలు నల్లసముద్ర తీరానికి చెందిన ప్రాచీన ఇండో **ఆర్యన్ సంతతివారే. వీరి పూర్వీకుల్లో చాలామంది ఉత్తర కాకసస్, దెర్బెంట్, కాస్పియన్** సముద్ర దక్షిణ తీరం ద్వారా హిందుస్తాన్‌కు **తరలి వెళ్ళారు.** బోస్పొరాన్ నామాలు, **స్థలనామా**

లకు సంబంధించిన ప్రాచీన భారతీయ ట్రాన్ స్క్రిప్షన్లను (లిపిబందాలను) ఆయన ఉటంకించారు. అవి చాలా ఆసక్తికరంగా వున్నాయి. వాటిలో కొన్నియివి: స్థలనామాలు తిరితక్ (ఉధృత ప్రవాహం), తిరాంబా (వేగంగా ప్రవహించేనీరు); నామాలు, మిత్రిదత్ (మిత్రుడు), ఇండియా; నది కుబాన్ (మెల కలతో నిండినది); తెలగనామాలు దండారి యన్స్ (సంచార ఆర్యన్లు), టొరెట్స్ (నదిగట్టు), సిందులు (నదిపార్శ్వం), తామన్ సిందులు ట్రాస్‌లో నివసించే సిందులు, సిందునది దిగువ ప్రాంతాల్లో నివసించే సిందు మానవుడు — యీపేర్లలోని పోలికలు యాదృచ్ఛికమైనవేమీ కావు. అలాగే కరకందమా సరస్సు (తామన్ జలసంధి), భారతదేశంలోని నగరం కరికరదామ్ అనే పేర్లుకూడా. అజోవ్ సముద్రం మొదలు కొని సిందులోయ వరకూ గల ప్రాంతంలో స్థలనామాలను త్రుబాచెవ్ అధ్యయనం చేశాడు: సిందుస్-సిందూ; సిలిస్- సిలియస్: సర్కార్ -సర్కారా. ఇండో ఆర్యన్ ప్రత్యయం "ఆకా' తో అంతమయ్యే స్థలనామాలు ద్నీపర్ నుండి ప్రాచ్యం వరకూ వ్యాపించివున్నాయని ఆయన రుజువు చేశాడు: పశ్చిమ క్రిమియాలోని తమిరకా, దండకా; తామన్‌లోని అబొరకా, పశ్చిమ కాస్పియన్ మండలంలోని బారకా, మధ్య ఆసియాలోని ఆరియకా, సిందునది ఎగువ ప్రాంతంలోని అందకా.

సిధియన్ల వత్తిడివల్ల సిమ్మేరియన్లందరూ ఆసియామైనర్‌కు తరలిపోలేదు. కొందరు నల్లసముద్రతీరంలోని దుర్గమ ప్రాంతాల్లో తలదాచుకున్నారు. వారి పూర్వీకులైన సిందులనే తామన్‌లో గ్రీకులు కలుసుకున్నారు. పురావస్తు రుజువుల ప్రకారం యీ సిందులు క్రీ.పూ. ఏడవ శతాబ్దంనాటికే స్థిర నివాసమేర్పరుచుకున్న వ్యవసాయదారులు. వారు రాజ్యాన్ని ఏర్పరచుకునేదశలో అప్పుడున్నారు.





## మిహయీల్ మిషిన్

మనం అడగాల్సిన ప్రశ్నలెన్నెన్నో ఉన్నాయి: ఎందుకు? దేనికోసం? ఎందుకు వీల్లేదు.

వీటన్నటికీ సమాధానం ఒకటే— ఎందుకంటే "నీవు చెయ్యకూడదు" అన్న మాటలు. లేకపోతే మనం, సోవియట్ ప్రజలం బతకలేము. "నీవు చెయ్యవచ్చు" అన్న మాట లేకుండా మనం హాయిగా బతికెయ్యగలము.

"నువ్వు చెయ్యవద్దు", నువ్వు చెయ్యకూడదు" అనే మాటలు పుట్టిననాటినుండీనే మనల్ని పీడిస్తున్నాయి. "నోర్మూసుకుని కూచో!" "ఖబడ్‌దార్" "మట్టిలో ఆడుకోవద్దు, నీ ప్యాంటుకు మట్టి అంటుకుంటుంది" "బస్సుల దగ్గర పరిగెత్తవద్దు!", "ఈ స్వీట్ మీదినుంచీ చెయ్యి తీసెయ్!"

"నేను చెయ్యవచ్చా?"

"వద్దు, నువ్వు చెయ్యకూడదు." అన్నది మనల్ని సదా వెంటాడే మాట.

మనం లాన్‌లో నడుంవాల్చకూడదు. పార్కులో కుక్కను వెంటబెట్టుకు తిరగకూడదు. లేదా...

మనం దీన్ని గురించి ఆలోచించి చూస్తే, అంతా బాగానే వుంది. "నువ్వు చెయ్యవచ్చు" అన్న వ్యక్తినే తీసుకుందాం. యిక అతని బ్రతుకే దుర్భరమై పోతుంది. తన ఫోను మ్రోగగానే అతడు ఉలిక్కిపడి అందుకుంటాడు. రాత్రి నిద్రలో అనేకసార్లు చెమటలు కక్కుతూ లేస్తాడు. అతని పరిస్థితి, అడుగడుగునా ప్రమాదం వాటిల్లే యుద్ధరంగంలోని సైనికుని పరిస్థితిలా తయారవుతుంది. ఇక అతని పని ఒంటరి పక్షి పని అవుతుంది. అనుమతి నిచ్చిన వాడు తర్వాత ఎవరికీ అవసరంలేనివాడైపోతాడు.

# నిషేధాలూ

చిత్రకారుడు : యూరి అష్కోవ్

ఇక, "నువ్వు చేయకూడదు" అనే వ్యక్తిని తీసుకుందాం. అతడి మంచి భవిష్యత్తుకు ఢోకా లేదు. అతడు అందరికీ కావలసినవాడే. అతనిచుట్టూ జనం ఎప్పుడూ మూగి వుంటారు. అతని మొరటు హాస్యోక్తులకు అంతా నవ్వుతారు — అతని ఆదరణ సంపాదించేందుకోసం: "నువ్వు చెయ్యకూడదు", "నీకా హక్కులేదు" అని అతనితో మరోసారి అనిపించుకోవడానికి జనం అతణ్ణి మళ్ళీమళ్ళీ వెళ్ళి చూస్తుంటారు.

నువ్వు చేయవలసిన పనులు చెయ్యకూడదన్నప్పుడు, సాధారణంగా, నువ్వు చేయకూడని పనులు చేయవచ్చునన్నమాట అంతేనా?

ఎన్నటికీ దిగుబడినివ్వని పంటపెట్టాలి. లేక వర్షంలో కుళ్ళిపోవడానికి వీలున్న దాన్ని పండించాలి. నువ్వు దిగుబడిని తూచాలి. దాన్ని 12 పెట్టి హెచ్చువేయాలి. మైనస్‌పై నిలువగీత గీచి దాన్ని ప్లస్‌గా మార్చాలి. బ్రహ్మాండమైన దిగుబడి వచ్చిందని నువ్వు నివేదిక ఎంపాలి! నువ్వు ఎన్నడూ చేయలేని లేక చేయకపోతేనే బాగుండేదనిపించేలా చేసే పనులను మాత్రమే చేస్తానని నువ్వు హామీ యివ్వాలి. మోటారు సైకిళ్ళు తయారై, నడుస్తున్నచోట ప్రపంచంలోకెల్లా వేగంగా వెళ్ళే సైకిళ్ళను కనిపెడుతూ సంవత్సరాల తరబడి కాలాన్ని వ్యర్థం చేయాల. ముఖ్యంగా నువ్వు చేసిన పొరపాట్లకు వస్తుగత ఇబ్బందులను అడ్డుపెట్టుకోవాలి.

ఇదంతా యెందుకు జరిగింది--?"

"ఎందుకంటే," అని మొండిగా కారణాలు చెప్పవచ్చు.

ప్రతి "ఎందుకు", అనే ప్రశ్నకు "ఎందు

# అనుజ్ఞలు



కంటే'' అన్న సమాధానం వున్నప్పుడు, యే చెడుగుకు పరిష్కారముండదు: పరిస్థితులు మెరుగుకావు. దీన్ని మనం బయటికి ఒప్పుకో కూడదు.

ఉన్నదున్నట్టు చెబితే ఆగ్రహోదగ్రులైన జనసమూహం నీపై దాడిచేయడం ఖాయం. ''పచ్చి అబద్ధాలు! ఇప్పుడు పరిస్థితులు నీవు చెబుతున్నట్టు లేవు. మునుపు మనమన్నిటినీ నిషేధించాం. కానీ, ఇప్పుడు ప్రజాస్వామిక పద్ధతిలో వాటిని అనుమతిస్తున్నాము'', అని వారు గొంతెత్తి అరుస్తారు.

నిజమే. వ్యవసాయం, కళాది రంగాల్లో కొన్ని విషయాలను అనుమతించారు. నువ్వు చేయవచ్చుననే మనిషి చరిత్రలో, అర్ధ శాస్త్రంలో తన సరియైన మార్గం తెలుసుకో ప్రయత్నిస్తున్నాడు. దుకాణాల్లో స్త్రీలు మారకం విలువగల రూబుల్‌ను గురించి చర్చిస్తున్నారు. అయితే, ఆ మాటకు అర్థమేమో తెలుసునని కాదు. పరిస్థితి ఇలాగే కొనసాగితే వార్తాపరి శీలకులు భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేయ డానికి సాహసించవచ్చు.

ఉన్నమాట చెప్పడం నిషిద్ధం కానప్పుడు, ఆమాట చెప్పవలసిన అవసరమేమని మీరన వచ్చు. చెప్పాల్సిందే. మన అనుభవాన్ని బట్టి ఈ మాటంటున్నాను. మునుపు ఒకప్పుడు గతాన్ని తిరిగి తలయెత్తకుండా పాతిపెట్టామని **నమ్మాము. కాని, అది నజీవంగా మనవెంటే** ఉంటూ వచ్చింది. ఐతే, వేషం మార్చిందంతే. కాబట్టి, ఉన్నదున్నట్టు చెప్పకుంటే, ''నువ్వు చెయ్యకూడదు.'' అనే గర్జనల్లో ''నువ్వు చెయ్యొచ్చు'' అని జంకుతూ చెప్పేవారి మాటలు వినిపించకుండాపోతాయి. అప్పుడు, నువ్వు **చెయ్యకూడదని చెప్పేవారు మనల్ని మింగేస్తారు.**

# ఆశువుగా

## బోరిస్ లేస్‌న్యాక్

ఏళ్ళతరబడి రంగస్థలంపై ప్రదర్శించే ప్రహసనం విషాదాంత నాటకమవుతుంది.

ఆ మనిషి కృత్రిమ ముఖాన్ని వాళ్ళు చింపివేశారు. కాని, అదే అతని నిజమైన ముఖమని తేలింది.

**అనేక మోడులు తాము మహావృక్షాలమని** అనుకొంటుంటాయి.

మరుగ్గా ఉన్న ప్రతి గదిలోనూ ఒక అస్తి పంజరముంటుంది. సరే. కాని, మరీ ఎక్కువ అస్తిపంజరాలను అక్కడ దాస్తే అది ఇల్లుకాదు, స్మశాన వాటిక.



చిత్ర రచన: యూరి

జవహర్‌లాల్ నెహ్రూ, నూతన రాజకీయ ఆలోచనా ధోరణి

మేరు పర్వతాలు యెక్కడున్నాయి?

**21 వ శతాబ్ద ప్రాంగణంలో దస్తయేవ్‌స్కీ**



జోస్తోవా
పెయింటెడ్ ట్రేలు
19 వ శతాబ్దపు ప్రారంభంనాటి హస్త కళకు, మాస్కో మండలంలోని జోస్తోవా గ్రామం పుట్టిల్లు. పుష్పాలు, పుష్ప గుచ్ఛాలు యీ పెయింటింగుల్లో ప్రధానంగా కనిపిస్తాయి.

# ప్రకృతి, కళ



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M236 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Shalini |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |